శ్రీరస్తు.

శ్రీ అహోబిల లక్ష్మీనృసింహస్వామినే నమః.

శ్రీ తాటిచర్లవారి

# విజయవిలాస నాటకము.

(ఉలూచీ సుభద్రా పరిణయములు)



[illegible] రామాయణము, [illegible], [illegible] [illegible], [illegible], [illegible] నాటకముల గ్రంథకర్తయగు

కీ॥ శే॥ [illegible] నారాయణకవిగారిచే

విరచితము.



ప్రకాశకులు:

సానికొమ్ము లక్ష్మీరెడ్డి,

బెజవాడ.

[వెల రు. 0-6-0.





శ్రీరస్తు.

శ్రీ మత్సదాశివ సద్గురు ప్రసాదాః

## శ్రీ తాటిచర్లవారి

# విజయవిలాస నాటకము.

---

శా॥ శ్రీలావణ్యనిజాంఘ్రియుగ్మము సదా సేవించుభక్తాళి ను
ద్వేలప్రాభవ సత్కృపాకలితుఁడై వీక్షించి యిష్టార్థముల్
లీలన్ మేలుగ గూర్చుచున్ గరము పాలించే వరాహోబిలా
శ్రీలక్ష్మీనరసింహు డీకృతిని నిర్విఘ్నంబు గావించెడున్॥

ఇష్టదేవతాస్తుతి. కీర్తన. రూపకం.

నారసింహ నన్నుబ్రోవరా । నగజాధిపనుత ॥నార॥
మారాభశరీరా నగధీరా । రణశూరా వర ॥నార॥
నీపదాబ్జములు నమ్మితి । నిగమాంత వేద్య ॥నార॥
పాపంబును తాపంబును । కోపంబును బాపుము వర ॥నార॥
సరసిజాసనాదివందిత । సకలేశ వరద ॥నార॥
కరిరక్ష కరుణాకర । నరకాంతక యాహోబిల ॥నార॥

గణపతిస్తుతి. కీర్తన. ఆదితాళం.

గజవదనా మంగళాసదనా । మ్రొక్కెదా ॥గజ
ముదమున నీమృదుపదవనజంబులు । హృదయములో నిలిపెద
దయగను ॥గ

మూషకవాహాన మోదకవరకర । పోషితత్రిభువన పురుష
శేఖరా ॥గజ॥
శంకరసుతాపాశాంకుశధార । శశాంకవర్ణ యకలంకచరిత ॥గజ॥
కరుణతో నిర్విఘ్నములోనగూర్పుము । ధరణినిలక్ష్మీనరసార్చిత ॥గజ॥

## సరస్వతీ స్తుతి.

మదిని సమ్మతి భారతి । నిత్యము నానెమ్మదినీ
వదలక సీవు నావాక్కున నిలచియు । కుదురుగ మృదుపల్కులు
పల్కించుము ॥మది॥
తల్లినీదుపదపల్లవములు నా । యుల్లములోపలనుంచి భక్తిగ ॥మది॥
నారదకుందతుషారహార । సురవారణతులతశరీరిణ నిను ॥నా॥
పంకజలోచన పాపవిమోచని । వెంకటనరసాభిఖ్యసనార్చిత ॥మది॥

## ద్విపద. కర్తృ వంశావళి.

శ్రీకరంబై నయీక్షితితలంబునను, ప్రాకటాహోబిలపతిపదయుగళ
సేవాధురీణులు శ్రీతాడిచర్ల, పావనవంశసంభవులు సత్కవులు
వసుధవాధూలసవరగోత్రఘనులు, అసమానగుణులు ప్రఖ్యాతచరితు
లట్టిసత్కవునందు నబ్ధిని విధుడు, బుట్టినచందాన బుట్టిపెంపొందె
వెంకటనరసాఖ్య విబుధు డాయనకు, వెంకటసుబ్బాంబ వెలసెభార్యగను
నావధూవరులకు నాత్మజులగుచు, నావిర్భవించిరి యైదుగు రందు
శేషాచలార్యుండు శ్రీకోటమాంబ, నాశతో పెండిలి యై యామెవల్ల
శ్రీమీర గాంచె లక్ష్మీనరసాఖ్యు, రామకృష్ణార్యుండు రమణాంబవల్ల
కన్నన గాంచె వెంకటనరసాఖ్యు, అన్నదమ్ములబిడ్డలయ్యు
నీలక్ష్మీనరుసును
వేంకటనరుసు నొండొరులు, వరమైత్రితోడ బ్రవర్తింపుచునుండి
ఘనముగా నొకనాడు కడుమోదమునను, నను చూచి తాళ్లూరి
నారాయణాఖ్య

కవివర్య యొకనాటకము రచియించి, ప్రవిమలాహోబిలపతికి నర్పించు,
అని పల్కి తాంబూల మపుడిచ్చి వారు, చనిన నే నొక్క లక్షణ
ముహూర్తమున
నరసుభద్రాపరిణయ నాటకంబు, విరచించినాడ కోవిదు లవుననంగ
తప్పుగల్గినచోట తగ విమర్శించి, ఒప్పుగా దిద్దుడో వో బుధులార.

క॥ ధరలో తాళ్లూరికిలా
కరు డగు నారాయణాఖ్య ♦ కవివర్యునిచే
విరచితమైన సుభద్రా
పరిణయనాటకము వినుడు ♦ పండితులారా!

చోపుదారి వేషం పాట. ఆది.

చోపుదారీవాడూవచ్చెను । భీకరాముగనూ । చోపుదారీవాడువచ్చె
వ్యాపితోగ్రంధగ్రసత్రి । తాపముజూపూచూ జనుల । చూపులు
మిఱుమిట్లుగొనగ ॥చోపు॥

మెండుగాను పండ్లుగొరకుచూ । మధ్యందినమార్తాండుకరణి వేడి జూ
పుచూ । దండిగ శత్రూజనములు । గుండె లవియ యార్చుచూ ।
నుద్దండుడై యూఖండముగ । బ్రహ్మాండభాండ మదరిపడగ ॥చో॥

వురువడి మీసాముదీడుచూ । కుజనాళీనెల్ల బిరబిరనటుబోవా మీటు
చూ । ధరనూ తాటిచర్ల లక్ష్మీనరస శ్రీవేంకటానరస । వరదుడౌ
శ్రీయహోబల నరహరిని దలచుచును ॥చోపు॥

—♦ చోపుదారి వాక్యం ♦—

ఛప్పన్న దేశాధీశుల కప్పంబు లొప్పగించ నొప్పుకున్న నప్పుడె
వారల తలచిప్ప లుప్పరంబున కెగయించి, తప్పక కొనెడు ధర్మరాజు
గారిని యెప్పుడు గొలచి గొప్పజెందిన చోపుదారిని అప్పుడు మీపతి
యిప్పుడు చెప్పనలవిగాని హాయలుచే గొప్ప మానిక్యమ్ముల సొమ్ములు
మెప్పుగ వెలయు యొప్పులకుప్పలు కప్పుగల తమ కొప్పులయందు

దురిమిన విప్పుగ విరులు గుప్పున వాసింప నందియలచప్పు డుప్పతిల్ల నండ రాకొండలనైనను బిండి బిండిజేయు కండ్లకావరముచే గండుమీరి దండధరునైన గుండెలవియించి బెండువడజేయ జూచి దండిభటు లుద్దండోపతండములు వెంబడించి వచ్చుచుండగా నిండోలగంబునకు వచ్చుచున్నాడు గాన హెచ్చరికజేయ వచ్చితిని జనులారా!

ధర్మ. వాక్యం. కథ. దర్వు. సావె. ఆది.

ధర్మరాజు వెడాలె । ఆస్థానమునకును ॥ధర్మ॥

ధర్మరాజు మోదమ్మున జనములు । కూర్మితోగొల్వగ । నిర్మలమతితో ॥ధర్మ॥

వందిమాగధులు । పొందుగపొగడుచు । వందనములు జేయ తన ముందర భేరులు । మురజపటహములు । ధంధణ యని మోియ । యెందు జూచినను । సందడిజేయుచు । సందులేక బటుబృందము నడువగ ॥ధర్మ॥

యురమున నిగనిగ । మెరయుచు ముత్యపు । సరములు చెల్గగనూ । సురుచిర నవరత్నస్ఫురిత । కిరీటము । శిరమున వెల్గగనూ । ధరణిని లక్ష్మీనరశింహాఖ్యుని । వరదు నహోబిల । హరినినుతింపుచు ॥ధర్మ॥

—♦ సంధివాక్యము ♦—

కుంతిమహాదేవి గర్భసంభూతా పరాకు

పాంచాల మనోరంజనా పరాకు

యిందిప్రిస్థ పట్టణాధీశ్వరా పరాకు

ధర్మరాజ మహాప్రిభో పరాకు

బహు పరాకు.

—♦ ధర్మరాజు వాక్యము ♦—

అహా! భటులారా నాకొలువుకూటంబునందు విద్వాంసులు, కవివరులు, భట్టారకులు, గాయకులు, పరిహాసకులు, ఇతిహాసకులు, పౌరాణికులు నేడు సప్తాంగములవారు, పరివేష్టించి యున్నారటరా!

—♦ చోపుదారి వాక్యం ♦—

అటులనే నిండి కొలువ్వుదీరియున్నవారలు.

ధర్మ. సంధివచనము.

అంతట ధర్మరాజు రత్నసింహాసనంబున నివసించియున్న సమయంబున.

నారదమహాముని వచ్చుట. దరువు. ఆది.

కృష్ణాకృష్ణాకృష్ణా హరే హరి ॥కృష్ణ॥
విష్ణు హరి గోవింద మురారే ॥కృష్ణ॥
శ్రీమధుసూదన వామనశౌరి । నామది గొలిచెద నరహరే ॥కృష్ణ॥
నారాయణ జగన్నాధ యహోబిల । నారశింహ కరుణాకరహరే ॥కృష్ణ॥
గిరిధర వెంకటనరసార్చిత శ్రీ । ధరపురుషోత్తమ ! దాశరథే ॥కృష్ణ॥

—♦ నారదుని వాక్యం ♦—

ఔరా ద్వారకా బ్రహ్మమానస పుత్రులగు నారదులవారు వచ్చియున్నా రని మీరాజుగారితో విన్నవించరా.

—♦ భటుని వాక్యం ♦—

ఇట్లు భటుండు వొచ్చి తెలిపిన నారదమునికి నెదురుగా ధర్మరాజు నేగి పూజించి తోడితెచ్చి యొక్క రత్నపీఠంబుపై గూర్చుండజేసి.

—♦ ధర్మరాజు కందం ♦—

దండమునారదమునివర, దండముయోగీంద్రతిలక । దండముస్వామీ,
దండము త్రిలోకసంచర, దండముకామాదివైరి । తాండవచతురా.

—♦ నారదుని కందం ♦—

వర్ధిల్లుధర్మరాజ, వర్ధిల్లుమోపూర్వవంశ । వారిధిరాజా,
వర్ధిల్లు ఇనసమ తేజ, వర్ధిల్లుము యాచకాళి వరసురభూజా.

ధర్మరాజు. దర్వు. ఆది.

పావనమాయెను మా । వంశమెల్ల తావకదివ్య । సందరిశనమువల్ల ॥పా॥
సర్వాంతర్యామిని సన్నుతింపూదురు । సర్వలోకంబులు సంచరింపుదురు ॥పా॥
శ్రీతాటిచర్ల । లక్ష్మీనరసాఖ్యప్రీతిచేహోబిల । హరికృపవలనా ॥పా॥

—♦ సంధివచనము ♦—

అని వినయంబున బలికిన ధర్మరాజునుచూచి నారదుండిట్లనియె.

నారదుని దర్వు. ఆది.

మానవనాయక నే నొకమూచ్చట । మానుగ దెల్పగ బూనిటకొచ్చితి ॥మానవ॥
మీరన్నదమ్ములు మిక్కిలిమైతిని । యూరకనుంటిరి యీవర కేవురు ॥మానవ॥
అందరికొక్కతెనయ్యెనుభార్య । మీకందుచెనిష్టము యెప్పుడు బోవునో ॥మానవ॥
వినుతాటిచర్ల వెంకటనరస । వరదునహోబిలవాసు నుతింపుచు ॥మానవ॥

ధర్మరాజుకందార్థము. ఆది.

నారదమునివర మేమొక । పోరెరుగక జెలిమిగలిగి । పొదలుచునుండగా
మీరానతిచ్చి నటువలె । నేరీతిని భేదమగునూ ॥నేటికీ॥
మాబుద్ధిచెడదె నాటికి । బోటికొరకు మా । బోటివారు । కొట్లాటకు
జొతురే । సాటివారిలో ॥నేటికీ॥

నారదునికందార్థం. ఆదితాళం.

సుందోపసుందులను వా । రందంబున నన్నతమ్ము లతిస్నేహమునన్ ।
బొందుగనుండియు వారొక । సుందరి కతనమున బోరా జొచ్చిరి ।
యొండొరులు । పొడుచుక ॥చచ్చిరి॥
యెచ్చటనైనను యింతులవల్లనె । వచ్చును భేదము వారు వాదులకు
॥జొచ్చిరి॥

ధర్మరాజు. కందార్థము. ఆది.

మంచిది మీపంచినయటు । పాంచాలిని యేట నొకని స్వాధీనములో ।
నుంచుకొనెద మటులున్నపు । డెంచక మరియొకడు పోయె ॥నేనియు॥
రాజ్యము సుఖమూ । మానియు తా నొక సంవత్సరము తీర్థముల ।
స్నానముజేయగ । జనవలె మరచే ॥నేనియూ॥

నారదుని కందార్థము.

ప్రీతిగనాతో బలికిన, రీతిగ రాజేంద్ర యాచ । రింపుము మీలో, ఖ్యాతిగ వైరము గలుగదు, చేతోమోదంబు మీకు । జెందునూ సంకాటములు డిందూనూ, పొందుగ మేమిక పోయివచ్చెదము । మందర ధరుని, మరువక మోదము ॥జెందుమూ॥

—♦ సంధి వచనము ♦—

అని సంభాషించి నారదుండు యథేచ్ఛంజనియె నపుడూ.

అర్జునుడు అన్నను జేరుట.

—♦ అర్జునుని వేషం. కందం. ♦—

శ్రీమదహోబిల హరిపద, తామరసములకును మ్రొక్కి । ధర్మజు జూడన్;
వేమరు నెమ్మదిదలచుచు । నేమంబున వచ్చినాను నే నర్జునుడన్.

అర్జునుడు, దర్వు. ఆది.

అర్జను డరుదెంచె । అన్ననుజూడా । నపు డర్జ ॥అర్జ॥
కాంతలు నలరెడు కీర్తిని । యార్జించిన ఘనుడని జను లెన్నగ ॥అర్జ॥
రాజముఖులు శింగారము జూడగ । జాజులు రోజిల్లి వేడగా ॥అర్జ॥
రాజీవాక్షులు । రాజితముగని రాజన మివ్వగ । రాజచిహ్నముల ॥అర్జ॥
మొల్కనగవు ముద్దుమోమున గుల్కా । పల్కులమృతమునో । బరువడి
జిల్క । నలువుగ లక్ష్మీనరసార్చితుడగు । నిల నహోబిలాధీశుని
బొగడుచు ॥అర్జ॥

అర్జు. సీసార్థము. ఆది.

భటవర్యమాతోడ । పాంచాలి యేడాది । యొక్కరితో గూడి । యుండు
నటులనటు లున్నచో నన్యు । లచటికి నేగిన । తీర్థయాత్రకు । నరు
దెంచవలయు । నని నారదునివద్ద । నమకుంటి మీవేళ । ధర్మనంద
నుడును । ద్రౌపదియును । నున్న ధనుశ్శాల । కొకపనికోసమై
నేనుపోయితీ తెలియాక నావల్లశబదా హాని వచ్చానుగద యాక।
పూనితీర్థములాడాగాను । మాయన్నగారి యానతిగొని । పోవ సాను
రాహస్యవేళా । నేను బోయితి దెలియాకా । నావల్ల శబదహాని
వొచ్చెను గద । యాకా పూని తీర్థాములాడాగానూ మాయన్న
గారి । యానాతి గొనిపోగా । నానురహస్యవేళా । నేనూ బోయితి ॥

—♦ సంధి॥ వచనము ♦—

యిట్లు తెల్పుచు ధర్మజుని యాస్థానంబునకు జేరి నమస్కరించి.

అర్జనుని. ద్విపద.

నోవసుధాధీశ యొకబ్రాహ్మణుండు।గోవును దొంగలుగొనిపోనవొచ్చి।
హాయని మొరపెట్ట నాపని కరుగ। నాయుధశాలకు నరుదెంచియచట।
ద్రౌపతియునుమీరు దగనుండగంటి । లోపమువొచ్చెనాకో శబద
మున । కటుగాన తీర్థంబులాడివొచ్చెదను। దటకున శలవిమ్ము ధర్మ
రాజేంద్రా.

—♦ అర్జునుని వచనము ♦—

బాపనికి ప్రాప్తించిన యాపద బాపుటకై పోవుచు దూపు చే పట్టుటకై ద్రౌపతియు మీరును నున్న దాపుకు వొచ్చితి. నప్పాపము బాపికొన భూప్రదక్షిణ కరిగి వొచ్చెద భూపాల.

—♦ ధర్మరాజు ♦—

గీ॥ విజయ యీలీల ననేల విప్రహితము । కన్న ధర్మంబుగలదె లోకత్ర యమున । గోప్రదక్షిణసలుపుటె భూప్రదక్షి । ణంబనుచు నెంచు నీమాననములోన.

ద్వైలాగు. అర్జునుని ధర్మరాజు సంవాదము. ఆదితాళ

అర్జు—తీర్థయాత్రకు పోయినచ్చెద । పార్థివేశ్వరబంపవే । వ్యర్థముగ శపథంబు । జెరచితి నక్కటా సైరింపవే ॥తీర్థ॥

ధర్మ—పార్థ యిదియొక। పాపమా కార్యార్థముగ । రాబోలదా సార్థకం బుగ విప్రపనికై । చనితి వదియె బాలడా ॥పా॥

అర్జు—మాటదప్పినవారు పాండుకుమారులని జెనులందురూ । మాటి కిని నపహాస్యమగునూ । మనల ననుకొనుచుందురూ ॥తీ॥

ధర్మ—తాటిచెర్లకులోద్భవుండగు । దనరువెంకటనరసునూ । ధాటి గానే వెల యహోబిల । ధవునికన్నియు దెలుసునూ ॥పా॥

—♦ అర్జునునికందార్థము. ♦—

నారదునిచెంత మనమన్నారము । శబదంబుగాను । నరపాల్క యీ నారియుమీరుండగ । గన్నారగ నేగాంచివచ్చినానుగా । ధర్మము జెరచినానుగా । మీసెలవుగోరినానుగా । వలదన్నా మాన లేనుగా॥ మానుగ ఓంకులమారివిజయు డని । మానవు లన బడ । లేను నిందే లన్నానుగా । వలదన్నా మాన లేనుగా॥

—♦ ధర్మరాజు కందార్థము. ♦—

కష్టపడజాలవనినే । యిష్టాగోష్టిగనునెంతో నెఱిగించిన నీ । కిష్టము లేదటుగావున స్పష్టముగా । తీర్థాయాత్రసల్పాగా । పొమ్మింక నిను

నిల్పగా । యెవ్వరితరము తెల్పగా శలవిచ్చినాను । పొల్పుగా నిల్పు నిదానము నీకు లేదుకరివేల్పునుగొల్చుచు। వెడలుముయాత్ర సల్పగా.

—♦ అర్జునుడు సంధి॥ కంద. ♦—

అని సెలవుపొందిధర్మజు । పనుపున పరిజనులు వెంట । బరువడిరాగన్,
ధర చెలికాడు విశారదు । డనువుగ జనుదేర యాత్రిలాడగ వెడలెన్.

అర్జునునిదరువు. ఆటతాళం. (ఇదిమారునివలె)

పార్థూడూ చను దెంచె । తీర్థాములాడా । పార్థివేష్టితోర్వి । వలయూమూ జూడా ॥పా॥

పరిజానాములు వెంట। బలసీ యేతేరా। వరవిశారదుడూ । సరసనరూదేరా ॥పా॥

అన్నాదీవెనలిచ్చి । అంపించగానూ । పన్నూగ గరుడాద్రి । పతికృపా తోనూ ॥పా॥

—♦ అర్జునుని పాట. అదితాళం ♦—

గరుడగమనహరినరకవిదారణ । హరసురపూజిత కరివరదా ॥గరు॥
సరసిజలోచన సాధుజనావన । పురుషోత్తమ శుభకరివరదా ॥గరు॥
ధరణి సహోబిళస్థలసువిహారణా । నరహరి కేశవ ఖరహరణా ॥గరు॥
ధరధరధరధర తాటిచెర్లలక్ష్మీ । నరసార్చిత భాసురచరణా ॥గరు॥

—♦ అర్జునుని సంధి. వచనము ♦—

యిటుల ప్రియాణంబె పోవుచు రాజు లెదుర్కొని యర్పించిన బహుమానంబులన్ గొనుచు తీర్థములస్నక్కి దానధర్మంబులు జేయుచు కొన్నిదినంబులకు భాగీరథీతీరంబు జేరి.

—♦ అర్జునుని కీర్తన. యేకతాళం. ♦—

కంటివా విశారద గంగానదియిదేకదా । వింటివా । దీనిముక్కంటితల నుంచి యింటిభాగీరథు డవనికి జేర్చెను ॥కంటి॥

మెల్లకల్మషంబులు । దుల్లు నిందు మునుగను । తెల్లము మాకులమెల్ల నర్థిల్లు యీ । తల్లిపూలమున యుల్లము రంజిల్ల ॥కంటి॥

యీతరంగబృందము । లెన్నా జెరుగమందుమూ । శ్రీతాడిచర్లలక్ష్మనర
సాఖ్యుని । ప్రీతి నహోబిలపతికూతురా ॥కంటి॥

—♦ అర్జునుని వాక్యము ♦—

అభంగభంగరోత్తుంగరంగద్భంగయు కలుషభంగయు నగు నీ గంగయందు మునుంగుము విశారదా !

—♦ విశారదుని వాక్యము ♦—

.అంత నందరు గంగలోని కరిగి స్నానంబుజేయుచు గంగను యిట్లని స్తుతించిరి.

—♦ అర్జునుని కీర్తన. ఆటతాళం. ♦—

గంగాభవానితల్లి నన్ను । కరుణించు కల్పవల్లి । రంగుగాను మునిగెదము । రక్షించుకల్పవల్లి ॥గంగ॥

పాపముబాపునీవూ నాదూ । లోపము లేమియు లేవూ । ప్రాపుదాపునీవే మాకు । మాపాల వెలసినావూ ॥గంగ॥

శ్రీఅహోబిల పతిపద।తోయజమున బుట్టితివి। హాయిగ వెంకటసాక్ష్యుని। నేలుక్షితి ॥గంగ॥

—♦ అర్జునుని కందము ♦—

యిటువలెస్నానములాడియు । తటుకునగూర్చుండి దానధర్మములిడుచున్ । తటకనజపమొనరింపుచు । పటుతరముగ గనులుమోడ్చి పార్థుండుండెన్.

—♦ ఉలూచి వేషం. తెర. ద్విపద. ♦—

మగువరోనావర్తమానంబు వినుము । తగుస్వర్గమర్త్యపాతాళంబుల నేడు । లోకత్రియంబునలోపలవన్ని । గ్రక్కొన్నపాతాళఘునలోకమందు । భోగవతీపురంబున గాపురంబు । నాగకన్య నులూచి నా పేరుచెలియ.

—♦ ఉలూచి. దరువు. అదితాళం. ♦—

వోచ్చే నులూచి జెనులు మేచ్చాగా వేగ। నేచ్చెలూలానుగూడి చెచ్చేర హేచ్చూగా ॥వో॥

పలుకుచెక్కెరరస। మొల్కగాముద్దు। కల్కివాల్ జూపులాకు। బెల్కు
మీలుల్కగా ॥వా॥
మించూరూచూల మేను। వంచాగా। జిగిఅంచాIగమూలనడక। లెంచి
జేయించగ ॥వా॥
వాల్కీల్ జడమేడనుదూలగ। చెలి। మేలుగ। మూత్యపుహా। రాలెదట్రే
లాగ ॥వా॥
కంకణములుIఘల్లుఘల్లన। చెలి। కర। పంకాజాపాణు। లిరు। వంకలా
గొల్వగ ॥వా॥
కూర్మివెంకటనరసశార్మాను। బలు। పేర్మి।పాలించు।నహోబిలపతి
కృపానూ ॥వా॥చ్చె॥

యిట్లు వెడలివొచ్చి తనచెలికత్తియలంజూచి యిట్లనియె.

—♦ ఉలూచి దర్వు. రూపకము. ♦—

రారెవనవిహారమునకు రమణులందరు వేగరారె। శారికమాయూరకీర
స్వరము విందమూ ॥రారె॥
చేడెలారాచెండ్లు కాట్టి యూమకుందమా। వేడుకలేమేమిగలవ్రా నేడుగం
దమూ ॥రారె॥
ధరను తాటిచర్లలక్ష్మీనరసయాఖ్యుని। వరమునా నహోబిలేశుని కరుణ
గైకొని ॥రారె॥

యిట్లు ఒకరికొకరుచెప్పుకొనుచూ పొరబాటున కదలి భూలో
కంబున చేరి గంగానది సమీపమునుండు వనములకు చేరి విహరింపుచూ.

—♦ ఉలూచి దర్వు. ఆదితాళము. ♦—

వన మేమో వింతగ నున్నదమ్మా ॥వన॥
భామా రామా లేమా కనగ ॥వన॥
యిందలివృక్షము లెందునచూడము। కందములా బృందములా అందా
మేమందు ॥వన॥
పల్లవసుమములుఫలములుచేతులIగిల్లుదమా చల్లుదమావిహరింపగ॥వన॥
నలువుగవెంకటనరసార్చితుడై। యలరునహోబిలనృహరిదయనుచేత॥వ॥

—♦ ఉలూచి వచనం ♦—

అక్కా మనము వనవిహారము చేయుచుండగా నామనస్సు కేమో వృత్తాంతంబుగలిగి దేహము పరవశమై ఏమి తోచకయున్నది ఏమి కారణమమ్మా!

—♦ చెలి॥ కంద॥ ♦—

అమ్మయీఅడవులందుల । కాముడువిహరింపుచుండు గావున నిపుడుణ్ । నీమేనుపరవశమై । నేమింతోచకనున్నదింమనిభాస్య॥ అక్కాయిక్కడనుండక । నెక్కడికై నను బిరాననేగుదమటవే । చక్కెరవిల్తుని చేతను । జిక్కకృశింపగనేలా శీతాంశముఖీ.

—♦ ఉలూచి సంధి. వచనము. ♦—

అని తలపోయుచు తక్షణంబున వనంబుదాటి గంగానదియొక్కయిసుకదిన్నెలపైకిఁజని దరియందు కూర్చొని తపంబుచేయుచున్న అర్జునునిఁజూచి ఉలూచి యిట్లనియె.

—♦ ఉలూచి పాట. ఆదితాళము. ♦—

అతడెవడె కోమలి । యత॥ నవమన్మథసుందరశరీరుడుడత ॥రేవ॥
యావనమునకు ననేకమార్గులు।నేతెంచియు మన మేగెదము యీవర
కెన్నడు నిచటచూడమితడెవడె ॥నరుడో॥ యలకిన్నెరుడో విద్యాధ
రుడో నిర్జరవరుడేను స్థిరముగ మదిగు ర్తింపజాల ॥యిత॥
ధరణిని లక్ష్మినరసార్చితుడై పరగు నహోబిలహరికృపను సరగున
చెంతకు జని చూతమే ॥యిత॥

—♦ ఉలూచి ద్విపదార్థము ♦—

యలనాగవినుమితడెవ్వడోకాని, తెలియగమైతి మే తేరగునైన।
కలసమాచారంబు కనుగొనవలయు, లలనాపోదాముఁరాగదె।చెంతా
కుజేరి తెలసివత్తాముఁరాగదె, అలకులవేణి దూరమైనందుచేతవాని।
తెలియాగజాల మిపుడు అలరుచు దగ్గరికి.

—♦ ఉలూచి సంధి వచనము ♦—

అని యోచింపుచూ కొంచెము సమీపమున కరిగి బాగుగా పరి శీలించి ద్రౌపతిస్వయంవరకాలమందున చూచివొచ్చిన నాగకన్యలు చెప్పుచుండుటవల్ల అర్జునునియొక్క రూపురేఖయు వినియున్నదిగాన ఆగుర్తునుబట్టి అర్జునునిగా భావించి నర్మసఖితో యిట్లనియె.

—♦ ఉలూచి పాట ♦—

పడతిరో చూడూ పార్థుడే యీతడు । వెడవిలుకాడూ వీనికి జోడూ ॥ప॥
ధర్మజుతమ్ముడె ద్రౌపతికాంతుడె । నిర్మలచిత్తుడె నీరజనేత్రుడె ॥ప॥
చక్కనివారిలో చక్కనివాడే । అక్కరో నేడూ దక్కినజాలునే ॥ప॥
ధరణి నహోబిల ధవ్రుడె వెంకటనరసును బ్రోచే హరిచెలికాడే ॥ప॥

—♦ ఉలూచి సంధి వచనము ♦—

ఇట్టుల దెలిసికొని యిది సమయంబుగాదని యొక్కచో దాగి యుండి నాసాయంకాలము చొక్కజల్లినట్లందరు నిద్రబోవుచున్నప్పుడు. మెల్లగా జని.

—♦ ఉలూచి కందము ♦—

నాగాంగననిముషములో। భోగవతీపురమునకును పురుహూతసుతుజ
వేగమె గొనిచనియప్పుడు । బాగుగతనపడకటింటిపాన్పననుంచెజ.

—♦ ఉలూచి సంధి వచనము ♦—

అంత కొంతదడవునకు మేలుకాంచి లేచి కూర్చుండి నలుదెసలు పారజూచి సవ్యసాచి నివ్వెరగందుచూ.

—♦ అర్జునుడు పాట. ఆటతాళము. ♦—

ఎంతా వీచీత్రముగంటి । యీయింతి యెవ్వరొకాని యెరుగాలేకుంటి ॥ఎంతా॥
వింతా గంగానది ప్రాంతాములం దుండి। యింతాలో యీమేడా కెటులా
జేరితినీ నే నెటులా జేరితినీ ॥ఎంతా॥
నాతోడ వొచ్చినా నాయాప్తులందరూ । యేతీరు పోయినారో
యెరుకాలేదాయె ॥ఎంతా॥

వారుసా నాహోబిల వాసూడా శ్రీలక్ష్మి । నరసాఖ్యనేలూ శ్రీ
హరిమాయా యేమో ॥ఎంతా॥

సం॥ వ॥

యిట్లు హాశ్చర్యపడి తన ముందరనున్న కురంగలోచనఁ గనుం
గొని యిట్లనియె.

—♦ అర్జు ఉలూచి డైలాగ్. అట. ♦—

అ॥ నీ వెవ్వరేచెలి నీపేరు దెల్పుము । యీ వరసౌధము లెవ్వరిదో కదె ॥నీవెవ్వ॥

ఉ॥ భూవరచీలువ । బోటి నులూచిని ; దేవర యీమేడ । తెలియుము నాదని ॥భూవర॥

అ॥ వేగమే యీపురి పేరేమొదెల్పవె । నాగకులాంగన నన్నెపుడూ గంటివె ॥నీవె॥

ఉ॥ భోగవతీపుర మో గుణనిధి యిది । భాగీరథీకడనే గంటినిన్ను నూ ॥భూ॥

అ॥ ఎందుకుదెచ్చితి విచటికినన్నును । యిందుముఖీమణి యెంతటి ధీరవె ॥నీవె॥

ఉ॥ సుందరహోబిలమందిరమిత్రుడ । కందునికేళికి కలియగ దెచ్చితి ॥భూ॥

—♦ అ. పాట. ఆదితాళం. ♦—

చాలు చాలు । మంచిది చాలూ । నిలుపుముచాలూ । చాలుచాలు
నీమేలు ।బాల యిక చాల్చాలు ॥చాలుచాలు॥

అ॥ కన్ను మొరిగి నేనున్న వేళగని । పన్నగసుందరి నన్ను దెచ్చితివి॥చాలు॥

ఉ॥ అంగనరో నర పుంగవుడనుచు నెరుంగలేక । నను దొంగిలి తెచ్చితి ॥చాలూ॥

అ॥ నాకుచోద్య మీలోకమేడ నాలోకమేడ । యిది లోపపుపని యిక ॥చాలుచాలు॥

ఉ॥ ధరలో వేంకటనరసాక్షితుడా । సరగ నహోబిలహరి సాక్షిగ యిక ॥చాలుచాలు॥

—♦ ఉ. పాట. ఆదితాళము. ♦—

పొంచి నినుగాంచి మోహించి । రప్పించితి । మించిన తప్పు క్షమించి దయయుంచుమా ॥పొంచీ॥

యాలా జాగేల । యిదివేళా నన్నేలాగా । చాలాగ నినుబాసి తాళాగ జాలను ॥పొంచి॥

మారూడు మొగలి కతారీనినూరి । వేసారీక నే యానె జేరీతినారీతి॥పొంచి॥

ధరణిని వరలక్ష్మి నరసాఖ్య వరదూడా । సరగూ నహోబిల హరిసాక్షి సరి యాక ॥పొం॥

—♦ అర్జ. కందార్థము. ♦—

నేమానివృత్తిచేతను । కామకుడనుగాక వ్రితము । గ్గె కొని యిపు డీ। భూమిప్రివక్షణ సల్పగ । గామించియు తోడితేగా । కాంతారో తగునే॥ ధైర్యముతో నాచెంతా రాదగునె॥ యింతా సాహసు రాలా । యింతావివేకము మంతానమున నిసూమంత్రైన నుంచాక। వింతిగుణములదంతి। కాంతునిదంతి। పువ్వులబంతి। నాస్థితి యంతయునుని । నీ స్వాంతమున రవ్వంతయైనను । చింతసేయక । కాంతారో తగునా॥

—♦ ఉలూచి సీసార్థము ♦—

కురువీర నే కామకుడ గానటంచు నీవంటివి యిది యెటువంటిమాట। భువనమోహన రూపు బొల్పుగాధరియించి । చెలులను మోహింప జేశి మరుని । వాత దోర్రియుట యనవరతమనగా । వినుము ద్రుప దకన్యనిమిత్త మపుడు । మీరనుకొన్న శపదామూ దప్పినందుకూ । వొచ్చితి నదియె నెపమూగా నింకానెందూకూ॥ నృపతీవై యుండి నేనూ । తపసీ నానాగనేలా కపటాముమానీ నన్నూ । గృపజూడు నీవు మున్ను ॥శబదామూ॥

—♦ అ. ఉలూ. పాట. డైలాగ్. ఆదితాళం. ♦—

అ॥ చానారో నీ మాయామాటలు చాలు పలుకానేలానె । నేనూ
వ్రితమూ బట్టినానూ నిన్ను గూడాచాలనె ॥చా॥
ఉ॥ మానావేశా నిన్నుబాశి । మహినినిల్వ శక్యామా । పాృణాదా
నామూ నాకన్న వ్రితముగలదె దెల్పూమా ॥మా॥
అ॥ నిరుకూలేని ధర్మాములు । నిలచినాతో నాడాకె । సరశీజాలోచాని
నన్ను । మరులుకోనా జూడాకె ॥చా॥
ఉ॥ వరతాడిచెర్లా వేంకట సరసాశర్మ నేలీనా । పరగ నహోబిల పతి
పట్టి కేళీదెల్పూషుూ ॥మా॥

—♦ అర్జునుని కందార్థము. ఆది. తా. ♦—

ఇదివరకు భార్యయుండియు । సదమల శశివంశ రాజజాతు నయుక్ ।
విదితముగ గీ ర్తిజెడగ । మదవతి । పరకాంత నంటా । మంచిదా । యీ
నేరము । సైరించెదా । మావారాలాను । గాంచెదా । యించుబోణి ।
నన్నెప్పటి తావున । దించిరమ్ము । నను తిప్పలబెట్టగా । మాంచిదా॥

—♦ ఉలూచికందార్థము. ఆది. ♦—

పరకాంతయనగ । నొకరికి । పరిణయమై యుండెనేని । పలుకగవచ్చున్ ।
పరిణయమే కాలేదే । పరకాంత । యటంచు । నన్ను । బల్కాగా ।
ధర్మాము । గాదు చుల్కాగా । జూడాగ । ముద్దులుల్కాగా । కుల్కుచు
నే నిను । కోరి తెచ్చితిని । అలుకతోడ నన్ననతల బొమ్మని పల్కాగా
ధర్మాము॥

—♦ అర్జనునిపాట. ఆదితాళం. ♦—

పోపోగదే భామా నీ । పుణ్యామె । లేచి ॥పోపో॥
పాపపుకార్యము । పట్టుగాజేసితి । యీపని సరియే యిదియేమే । లేచి
॥పోపో॥
మావారలగన । బోవుదమన్నను । తోృవయెరుంగనే తొయ్యాలీ । లేచి
॥పోపో॥

ధరనూ నహోబిలా । ధవుడై లక్ష్మి । నరసాఖ్యు బో్రిచు హరిసాక్షిగ లేచి ॥పోపో॥

—♦ ఉలూచిపాట. ఆదితాళము. ♦—

నన్నుబో్రివు మొ్రిక్కెదా । నాథ నీకుదక్కెదా । నిన్నుగూడి । చొక్కెదా । నీదు మోవి నొక్కెదా ॥నన్ను॥

సైపజాల నింకనూ । స్వామి ప్రియమెల్లనూ । దాచియుంటి నీకును । ధారపోతు గైకొనూ ॥నన్ను॥

ధరణిలో నహోబిల । ధాముడగుచు వెంకటా । నరసవరియు । నేలేదు । హరికుమారు డేచెడు ॥నన్ను॥

అ॥ ఔనే యులూచి॥

ఉ॥ వ॥ యేమి సవ్యసాచి.

—♦ అర్జ. ఉలు. సంవాదం. పాట. ఆదితాళం. ♦—

అ॥ నిన్నెన్నడై నాను । నేగానను చెలి । నన్నెన్నడై నాను నీవు గానవూ। మున్నే మొ చుట్టిర్కు మున్నట్టు । నామో్రిల । వన్నేలు । చిన్నేలు। బన్నేవు । కన్నీయ ॥నిన్నెన్న॥

ఉ॥ మున్నే నీ సుందారమును వింటిని । నా కన్నూలపండూగా । గాగంటినీ । తన్నూగా తరుణులు । పాంచాలి పెండ్లిలో నిన్నుకను గొన్నమని । యన్నాగ తిన్నాగ । ॥మున్నేనీ॥

అ॥ రోతాకూటికి । నన్ను లోజేయకే । పిచ్చికూతాలు నాతోడ కూయాకూవే । నీతి నిషిద్ధాము । నీకేల లేదాయె । నాతీ వినవై తివి నాతారమా । తెలుప ॥నిన్నెన్నడై ॥

ఉ॥ ఖ్యాతీగ ధారూణి । నాహోబీల । నీ। కే। తానూడై దయచేత నీల। శ్రీ తాడిచెర్ల లక్ష్మీనరసాఖ్యుని ప్రీతిగను । నేతాసుతు । చేతాకు। నేతాళ ॥మున్నేనీ॥

—♦ అర్జనుని కందార్థం. ♦—

మునుపొక పాపముజేసియు । ననువుగ నది బాపుకొనుటకై । వచ్చితి। నే విను మింకొక పాపంబును । ఘనముగ । జేయంగదగునే కామినీ ।

కరిరాజనిభా । గామినీ । పన్నాగాకూలా । భామినీ । నీమూర్ఖమునకు నేమిజేసెదను । నామాటలు విని । నన్ను బంపవే । కామినీ॥

—♦ ఉలూచి కందార్థం. ఆది. ♦—

వెనుకటిపాపము గంగను । మునుగుటచే బోయె । పాపములు । పిమ్మట సి । వొనరింపవైతి । విక నా । పనుపున నను గూడుటిదియే । పాప మా । పురుషులకిది । లోపమా । నాపైన యింతా । కోపమా నాపని దీర్చక । నను విడనాడిన । పాపముబోవు నుపాయము । దెల్పుము । లోపమా ॥

—♦ అర్జ॥ ఉలు॥ సంవాదం (డై లాగు)ఆది. ♦—

అర్జ॥ పదపదవే భామినీ । అదరక బెదరక । వదరెదవిదె । పా । పద । పద । భామినీ ॥

ఉలు॥ చనియెదవా పార్థివా । పద । పదమని నను గదుమగానే॥ చని॥

అర్జ॥ నారీమని । భాగీరథీతీరము । జేరగవలె । నాకుదారిజూపు॥ పద॥

ఉలు॥ మేరుధీర బిగి । యార కౌగిటను । సారెకుబట్టక । యూరకనే ॥చని॥

అర్జ॥ కానికార్యములు । కావలెనంటె । చానరో యవి కొను చాగు నటె॥ పద॥

ఉలు॥ మానుగవాతెర । పానకమానగ । నేను సహోబిలనిలయునానా ॥చనియె॥

—♦ అర్జునుని సీసపద్యం ♦—

సీ॥ గంగలోస్నానంబు గావించి దరికిని । జనుదెంచి బ్రాహ్మణా జన ములకును । దానధర్మము లొనరించి మానంబు ధరియించి । కొంత సేపు సమాధికూడియుండి। పిమ్మటచాలించి ప్రియభోజనముజేసి । హరికథాలాపంబు లాలకించి । యిసుకదిన్నెలపైన । యింపుగా శయనించి । నిదురబోయెడువేళ । నీవు వచ్చి । నన్ను మోసంబుగ దెచ్చినావుగదవె । లోకనిందెకు లోపడలేక నేను । యెంతజెప్పినను చెవిజేర్చ వేమిజేతు । నుల్లమున । సైచి పో లేచి యో॥ యులూచి॥

—♦ ఉలూచి సీసపద్యం. ♦—

సీ॥ వాదేలరా దయ । రాదేల రా । పొద్దు పోదేలరా నీకు , పురుష
వర్య ! యింకేలరా । నీకు । శంకేలరా । మది । జంకేలరా । నవ్యపంక
జాక్ష । రావేలరా కౌగిలీవేలరా । యొప్పుకోవేలరా । నీవు భావ
జాంగ । రావేలరా । యింత సేపేలరా । ఇటు చూపేలరా నీకు ।
భూపతీంద్ర । చారుతరమూర్తివని నిన్ను ।కోరివలచి।చేరి దోడ్కొని
వచ్చి । శృంగార సౌధమందు । విరిశయ్య జేర్చితి । నతను కేళి జక్క
గానేలు దయజూచి సవ్యసాచీ.

—♦ అర్జ. వులూ. సంవాదం. హై లాగు. ఆటతాళం. ♦—

అర్జ॥ బాలామణిరో నాజోలికి రాకుమ । బాలాకు రాలావెనూ । వాలా
యముగ మెడాబట్టి నెట్టుచునుండే । యెలా చూరుబట్టి వ్రేలా
డుచుండేవు ॥బాలామణి॥

వులూ॥ యేలార జాగు నీ పాలబడితి నన్ను । నేలరా మరుకేళిలో ।
చాలాగ నుపరతి సమరతులను నన్ను । దేలించకున్నానే తాళాగ
జాలాను ॥యేలార॥

అర్జ॥ మక్కువా జూపాకె । మానినీ బలవంత । మాఘుస్తాన మబ్బునా
వక్కపొద్దైలేదు గొక్కునా బొమ్మంటె । వక్కా దాసరి
కైనా । వండ్లించమనియెవు ॥బాలా॥

వులూ॥ వెక్కస పడకుమూ వినుమూ । తాటిచర్ల వెంకటా నరసాఖ్యుని
చక్కాగా పాలింమూ । చక్రిధరుని సుతు । డక్కటపైకొని
యదలింపు చున్నాడూ ॥యేలార॥

—♦ అర్జనుడు ఉత్పలమాల. ♦—

మానవతీ లలామ వినుమా । ఫణిజాతివి నీవు । చూడ నే । మానుష
జాతి నౌదును । సుమా తల పోయగ నన్యజాతులన్ । మానుగ
కూడుట రహిమగనా , తగునా , సుజనాళి మెత్తురే । మానుము
మూర్ఖవృత్తి విడుమా ఘనమా । చనుమా తలోదరీ॥

—♦ అర్జున వాక్యం ♦—

వో కురంగనేత్రి । నీవు నాగాంగనవు । నేను మనుజపుంగవుడను । నీకూ నాకూ । సంగమం బేరీతి । నొసంగు నంతరంగంబున నెఱింగి తోలుంగవే॥ శృంగారాంగీ॥

—♦ సంధి వచనం ♦—

అనిన నమ్మానినీమణి ఇట్లనియె.

—♦ వులూచి ద్విపద ♦—

ధారుణీశ్వరనిన్ను । తగ వరియించి కోరి తెచ్చితి । రతిగూడి । సుఖింప । గలియక । నిర్దయతోడబోనాడ । న్యాయమా । మును రఘునాథుని తనయు డా । కుశరాజు చయ్యన గోర లేదె । మా కుము ద్వతిని నర్మదను బెండ్లాడి । గూడియాడడె । పురుకుత్సనృపుండు । నేడు నీమది । నుండె నిజముగా , గరుగనేరదయ్యెనుగాని । నే నేమి సేతు । నేరమెంచకను మన్నించరా స్వామీ॥

—♦ అర్జున - వులూచి - సంవాదం - జైలాగు - ఆదితాళం ♦—

అర్జు॥ కన్ను మిన్ను గానక పల్కంగనేలనె । మన్ననజదివింప నున్నా మతియుబోయెనే ॥కన్ను॥

వులూ॥ వన్నెకాడ । నిన్ను గూడకున్నా విడువనూ । పన్నుగ నీ మోవి నొక్కి । బాసజేతునూ॥ వన్నె॥

అర్జు॥ ఇంతిరో స్త్రీబుద్ధిప్రళయాం । తకమనుట । అంతయు నిజమాయెనె । వో కాంతా యిచ్చట॥ కన్ను॥

వులూ॥ పంతమా నామీద నీకు ప్రాణనాయకా , యెంతకసరివేసి నాను । విడువను యిక॥ వన్నె॥

అర్జు॥ నల్ల వల్ల ననుచుబల్కు వానిశిరమునా । నల్లనా తలంబ్రాలు పోశీ । నట్టులాయనూ॥ కన్ను॥

వులూచి॥ అల్లలక్ష్మీనరసుపాలు । డగు వాహాోబిలవల్లభుని । మిత్రి నాదువాంఛదీర్చరా॥ వన్నె॥

—♦ అర్జునుడు సంధివచనము ♦—

అని యిట్లు పలుకుచూ మితిమించిన తమకంబుచేత పైబడి కౌగిలింపబోయిన నతండు కసరి పారదోలుచూ॥

—♦ అర్జునుడు - పాట - ఆదితాళం ♦—

అవతలుండూ నా పైబడరాకూ । దండ । నుండ । చండ । మతమ ।
అవతలుండు॥ నాపై॥

నెఱజాణా మాటలు నీకెచెల్లు॥ నెర॥ నాకెమైనా, దానవగుదూ॥యవ॥
నడిరేయూనే పోరాటమేలా । మాయజాయ । న్యాయమటవె॥ యవ॥
సఖుడైన యహోబిల వాసుడు । కానివాని । గాను జూడావే ॥యవ॥

—♦ వులూచి పాట. ఆదితాళం. ♦—

పట్టివిడువ నీకా । జెట్ట । బట్టి । నన్నేలుమిక । కొట్టిన తిట్టిన నెట్టినగాని
నె । పట్టాగ మీాపాద । పద్మములను చే ॥పట్టి॥
ఈపానిచే మీాకు । లోపాము లేలేవు । పాపామనుచు నగ।గాపాడకున్నానె
॥పట్టి॥
విరహాము మీారెనూ । వెంకటనరసాఖ్య । వరదూని సాక్షిగ । సరసుడ
నిన్నిక ॥పట్టి॥

—♦ అర్జున వులూచి సంవాదం. సీసపద్యం. ♦—

అర్జు॥ నీతులు బోధించి నీకెంతదెల్పిన । భయము సిగ్గును మాని
పలుకగతగునె

వులూ॥ నీతులేమిటికి కామాతురాణాం । నభయం । న లజ్జాయనుటది
యు వినవె

అర్జు॥ మంచిది నీవనుమాట పర్యవసాన మెరిగించవె నాకు మెరుగుబోణి

వులూ॥ జాత్రిపతి మొదటిది తర్వాతయిదియని యెంచి సమముగా నేలు
మనఘు చరిత

అర్జు॥ నయభయంబుల దెల్ప వినంగవేమి

వులూ॥ అకటా పీడంగజాల మోహాంబుధిని

అర్జు॥ అయిన నీ యిష్ట మెటులనో యటుల నగునహా
వులూ॥ అదియె నాసమ్మతంబు కృపాంతరంగా॥

—♦ అర్జున సంధివాక్యం. ♦—

ఇట్లు వొడంబడి యర్జునుండూ.

—♦ అర్జునుడు కందపద్యం. ♦—

చెలియా నా వ్రతచందము, దెల్పితినే కాని నవల । దేలెడి నీకూ
పెలమినీ గాంచిన గలయక।నిలుపగ శక్యంబె మనసు।నిమిషంబైనన్॥

—♦ అర్జన సంధివచనం. ♦—

ఇట్లు పరస్పరానురాగంబులు మిక్కుటంబై పిక్కటిల్లిన నిలువంజాలక నరుం డులూచిని విరిపాన్పుపైకి జేర దిగిచి సరససల్లాపగాఢాలింగనేత్యాది సురతక్రియాకలాపంబులచే గరగింపుచు ముమ్మారు రమించిన తావత్కాలంబున.

—♦ వులూచి కందం. ♦—

గురుకుచ సద్యోగర్భము, ధరియించియు, శిశువు కంతతగనవయవముల్,
పరిపూర్తి నొంది పిమ్మట । సరసిజముఖి బలికె ప్రసవసమయంబగుటన్॥

—♦ బాలింతవేషం. వులూచి పాట. ఆదితా. ♦—

కాంత తాళగజాలనె, గర్భభారా, మింతయోర్వజాలనె । యెంతనియు
దెల్పుదుమది । కేమిదోచగలేదె ॥కాంతా॥
ఒడలు చమటాబోసెనే, మిన్నూ నామీదబడిన రీతిగా దోచెనె।
నడువబోయితె కాళ్లు, తడబడజొచ్చె, నకటా ॥కాంతా॥
సొమ్ములు బరువాయెనే । మాటిమాటికి । నెమ్మది జల్లుమనెనె, కొ
మ్మారొ యేమిసేతూ । దిమ్ముకొనెనె చెవులు ॥కాంతా॥
ధర నహోబిలేశుడై । లక్ష్మీనరసాఖ్య । వరమనో నివేశుడై । నిరతము
నేలుహరి।కరుణ యటులనగునో కాంతయీగర్భభారామీదా॥కాం॥

—♦ వులూచి వాక్యం ♦—

అక్కా యిట్టిబాధలు యెన్నడూ యెరుగనమ్మా॥

—♦ పులూచి కందపద్యం. ♦—

కలకజనించెను నడుమున। నిలువంగా తరముగాదు నిమిషం బై నక। పలుమాటలేల యికనా। జాలియు మరిమాన్పవమ్మ సారసనేత్రీ॥

—♦ పులూచి పాట. ఆటతాళం. ♦—

నిలువా తరమూగాదె। వో యమ్మనె ॥నిలువ॥
నిలువా తరమూగాదు। నీరాజగంధిరో। పలుమాట లేలానూ। భారామెక్కువాయె ॥నిలువ॥
మానిని దయయుంచవె। వేగమె మంత్రా। సానీని బిలుపింపవే। కాన రాని బాధగలిగెన నా మదిలోనను నిట్లు। నిదానింతునె చాన ॥నిలు॥
తెలుపు జనియించనె। వెక్కెల్లమో। తేపతేపకు మించనే। ప్రాపుజేరి నాకీ। బాధామాన్పినవారి। నాపద్బాంధవులని। యనవొచ్చునె చెలి ॥నిలువ॥
చెలియా నీ మదినుంచావె। యహోబిలస్థళవాసునీ సేవింపావె। వెలది తాటిచలక వెంకటనరసాఖ్యు జెలగి బ్రోచుమారికి। దెలును నాకష్టము ॥నిలువాతరమా॥

—♦ పులూచి కందార్థము ఆదితాళం. ♦—

యిటువంటి కష్టమొదవుట। కుటిలాలక యెరిగియున్న కోరి విజయు ని। చ్చుటికేల దెచ్చి। మిక్కిలి। హాటపడి కూడూదునా। తెలియా దాయెనె। ఔనౌనె మోసమాయెనె। నాకేమో భార। మాయెనె పాయక నాకీ। బాధ దొలుగు నదుపాయము దెల్పుము పడతీరో నిలువ॥దాయెనే॥

—♦ పులూచి వాక్యం ♦—

అమ్మమ్మా నే నిక నిలువజాలను త్వరగాపోయి మంత్రసానిని కొనిరావమ్మా.

—♦ సంధివచనం ♦—

అని పలికిన నెయ్యంపు నెచ్చెలి పోయి పిలచిన మంత్రసాని వచ్చుట.

—♦ మంత్రిసానివేషం॥ కథ॥ పాట॥ ఆదితాళం ♦—

మంత్రిసాని వచ్చెను । వేవేగ । మంత్రి । సాని స్వతంత్రము గాను । మంత్రితంత్రములు । మరివచ్చునాకని ॥మంత్రి॥

పకపకనగుచు । వికవికమనుచు । నొకతట్టుపిలచితే । యొకతట్టుచూచుచు ॥మంత్రి॥

గుసగుసమనుచూ । గొణుగుకొనుచు । వసుధ సహోబిల । వాసునుతింపుచు॥ మంత్రిసాని వచ్చెనూ॥

—♦ సంధివచనము ♦—

యిట్లు వచ్చిన మంత్రిసానిని జూచి.

—♦ వులూచి॥ పాట॥ జల్వ ♦—

భామా రాగదమ్మ నా । బాధమాన్పవమ్మాకొమ్మ । యేమి సేతునమ్మ కోమలీరో । నామీద ప్రేమయుంచగదవమ్మా॥ భామ॥

యెంతో భారమాయె నా । కేమి తోచదాయెచెలి । దంతిగమన యింకమీద । కాంతు నే । కాంతమున గాంతనెకాంతునె ॥మాభా॥

ఉత్తమాటగాదె । నీవు । చిత్తగింపరాదే । కొత్తదానగాను నేను । ముత్తెముల । మొత్తముల । విత్తముల । నిత్తు నీకు॥ భామా॥

ధరను తాటిచర్ల । లక్ష్మీనరసవర్య చాల । కరుణగను సహోబిల । వరవాసు నరసింహ । గూరిమీర । గొల్చుచూను॥ భామరా॥

—♦ సంధివచనం ♦—

అని పలికిన నంగీకరించి మంత్రిసాని చని తన నేర్పుకొలది నుపచారములు సలుపుచూ నిట్లని యనుచున్నది.

—♦ మంత్రిసాని సీసపద్యం ♦—

అప్పటప్పటికిని నొప్పులు మితిమీరె । బ్రిసవించు త్వరలోన పడతులార । మంత్రితీర్థంబును మరివెస గొనివచ్చి । యిప్పించరే మీరు యింతులార । పురుషులు గనకుండ । సరగున నొక తెర చాటు గాగట్టరే చానలార । కష్టంబులీడేరె యిష్టదైవములకు । మొక్కుకో

రమ్మ రయ్యా ముదితలార । వడిగ శిరసోదయమాయెను వనితలార । యెంత వేడుకగంటిమో యింతులారా । మంచి మగబిడ్డగల్గెనే మగువలార । కాంత నీళ్లాడెగదరమ్మ కాంతలారా॥

—♦ సంధివచనము ♦—

అప్పుడు చెలికత్తెలును మంత్రసానియు శిశువుని జలకమాడించి యీవార్త యర్జునునకు దెలిపిన సంతసించి బాలునకు యిలావంతుండని నామంబొసంగె నంత యులూచి శిశువును తొట్లయందుంచి చెలులతోగూడి యూచుచూ-

—♦ వులూచి॥ జోలపాట॥ ఆదితాళం ♦—

జోజో యిలవంతా । జోజో నీతివంత॥ జోజో॥

రాజావదనసుర । రాజా తనయ తనయ॥ జోజో॥

మొలకానగవునను మోమూన నంకురింప । తళుకుచెక్కుల ముద్దు । లొలుకు వెలుగునీకు॥ జోజో॥

జోలపాటలుపాడి । జోకొట్టుచుండిన । నేలనిదురాబోవు । యేమిసేయుదుమన్న॥ జోజో॥

నీయద్దు ముద్దుజూడ । నేటికి గలిగెను । నాయన్న, నాచిన్ని నాపెన్నిధానామ॥ జోజో॥

పోరుపెట్టాకనిదుర, బొమ్మింకకొంతసేపు । యూరాక । తొట్లబట్టి । యూచూచునుండెదము॥ జోజో॥

ధరను శ్రీ వెంకట । వరసౌఖ్యవాంఛిత । వరదూడహోబిలహరి నిన్ను బోచును॥ జోజో॥

—♦ సంధివచనము ♦—

యిటువలె జోలపాటలు పాడి యర్భకుని నిదురవుచ్చిన పిమ్మట యర్జునుం డులూచిం చూచి.

—♦ అర్జునుడు॥ ఉత్పలమాల ♦—

నీతి తొలంగి నన్ను గొని । నేర్పునదెచ్చి వారించి కూడితే । నీతరి జాగుజేసిన శుభేక్షణ తైర్థికకోటిమిత్రి । సంఘూషము లేమి

యెంతురో । సుఖంబుగ నెప్పటివోట జేర్చు । తలావ్వతలు । నీవు నీ సుతుడు వత్తురుగాక । సఖిశిరోమణీ॥

—♦ సంధివచనము ♦—

అనిన నమ్మాటకు నెమ్మనం బెరింగి యిట్లనియె.

—♦ వులూచి॥ కీర్తన ॥ ఆదితాళం ♦—

నిన్ను బాయజాలను । నేడు నిర్దయజాలును । నిన్ను విడువగ నేలను । నాథ నే నిక తాళనూ॥ ని॥

యింతలో మీారేగుట । యెరుగనై తినక్కట । పంతగించిచూచుట । పాడియే నిక మీాదట॥ ని॥

ధర నహోబిలధాముని । తనయుడగు నాకాముని । శరచయంబులధాకకు । సైపజాలను । విడువనూ॥ నిన్ను బాయ॥

—♦ సంధిమాట ♦—

అని పలికిన యర్జనుం డిట్లనియె.

—♦ అర్జనుడు కందార్థము ఆది. ♦—

కూడావచ్చిన హితులను । విడచి నదీతీరమునను వడివడి నీతో ।
గూడా చనుదెంచియు । నే నీడ వసింపదగునె । యింతిరో చెంగల్వ విరులాబంతిరో । గామనాజిత । దంతిరో పంతములాడిన । ఫలముగలదె యీా । చింతయేల ననుజేర్చుము దరికి ॥యి॥

—♦ వులూచి కందార్థము ♦—

పోవలెనని మీారన్నను । పోవలదని నేను బలుక । భువిమెప్పగునా ।
కావున దయచేయండిక । వేవేగమె నేనువత్తూ । వెంటానూ । యిప్పుడూ । నీజంటాను నినుబాసినిల్వ, యింటాను కంటకమున నను । కాముండేచగ।నొంటిగనుండగ। నోర్తునె ॥వత్తూ వెంటానూ॥

—♦ ఆది. ద్విలాగు. అర్జన వులూచి సంవాదం. ♦—

అర్జ—కాంత యింత చింతయేల । కార్యము నీవెరుగవా । సంతసమున యాత్రసేయూ । సాగనంపు పోయెద ॥కాంతా॥

పులాచి—కొంతకాలమైన మనము । కూడియుండామైతి మయ్యో ।
పంతమూన బ్రిహ్మ యెడబాపె । ప్రాణనాయకా ॥కొంతకా॥
అర్జు—వలదు వగపుచెందనిందూ । లలన కొద్దికాలమందు । జెలగి
సుతునితోడనందూ । జేరవత్తూగానీ ముందూ ॥కాంత॥
పులాచి—నలువుగ తాటిచర్ల లక్ష్మి । నరసయార్చితుండగు । నల
యహోబిలేశు సాక్షి । నిలువజాల నిన్ను బాసి ॥కొంతకాల॥

—♦ అర్జున చంపకమాల. ♦—

పొలుపుగ తీర్థయాత్రిలకు । బోయెదనంచును నన్నుతోడ నే । శల
వును పొందివచ్చితిని । చానరో నీకడనిల్చి యున్న దా । నలగి
యసత్యవాదియని । యాడును ధర్మజు డట్లుగాగ నే । నిలువగ వల్ల
లేదు । నవనీరజలోచన నన్ను బంపవే॥

—♦ సంధివచనం. ♦—

అని పల్కి సమ్మతించి యర్జనుని నిముషమాత్రింబున దన
సత్తావల్ల గంగాతీరంబునకు జేర్చి తిరిగితిరిగి చూచుచూ దన లోకం
బున కరిగె. నంత తెల్లవారిన యిక్కడ విశారదుండు నరునింగానక
తీర్థయాత్రిలకు కూడావచ్చినవారితో నిట్లనుచున్నాడు.

—♦ విశా. ద్విపద. ♦—

అకటా ధర్మజు । డనుజునితోడ । జక్కగానన్ను బొసటగాను
పంపె । ఇటువంటి ననుబాసి । యర్జనుడిప్పు , డేలకేగెనో । కాని యెరుగ
దరంబె । యీస్థళమహిమయొ । యీశ్వరీకృతమొ । స్పష్టంబుగా జెప్ప
జాల నెమ్మదినీ॥

—♦ విశా॥ గీతం. ♦—

అమితకలుష భంగయగు గంగలోపల । మజ్జనంబొనర్చి । మహీ
సురులకు । దానమొసగి । నీటిదరియందు । శయనించి । రాత్రి యిపుడు
కానరాడు నరుడూ॥

—♦ విశా. పాట. జల్వ. ♦—

పార్థునిజాడ చూడలేదే। తైర్థికులారా। వార్ధిమధ్య భూప్రదక్షిణార్థ
మరుగుదెంచె నిటకు ॥పార్థు॥
మారకోటి మంగళ। సుకుమార విగ్రహుండు, మేరు భూధరవీరుడూ।
గంగా, తీరమున లేడదేమొ ॥పార్థు॥
తీరుగ కుంతిమహాదేవి, కూరిమి సుతుడు ధారుణిలో నహోబిల, నార
సింహ సఖుని నేడు ॥పార్థు॥

—♦ విశారదుని సంధివచనము. ♦—

అని విశారదుండు బహుబంగుల నర్జునుంగానక నవ్వెపినంబుల నే వెదకుచు, నొక్కచో తనకు నెదురుగావచ్చు నర్జునుంగాంచి। కౌగ లించి యిట్లనియె॥

—♦ విశా. కందార్థము ♦—

బృందారకేశ నందన। యందరి మ మ్మిందు విడచి యెందరిగితివో।
డెందమున తెలియజాలను। కుందశరకారా తెలుపూ, కోరికా
మీరా। నగధర। ధీరా। వైరివిదారా। మీరు వొచ్చుదనుకా।
మేనులు మరచి, యున్నారము। మముగృప। నరశిబోవవొనన్ను
కోరిక మీరా॥

—♦ సంధి వచనం ♦—

అనిన నర్జునుండు నవ్వుచు నిట్లనియె॥

—♦ అర్జనుండు ద్విపదార్థము ఆది. ♦—

విను మా విశారద। విశదంబుగాను। మనమిందు నిద్రింప। మరియు
నులూచి। యను నాగకన్యక యరుదెంచి, వలచి ననుగూడ
మదినెంచెనూ తన లోకమునకు। గొనిపోయి। శయ్యనుంచెను
తన యూరిపేరుదెల్పి। యనవిల్తుకేళిదెల్పి। యనబోణి నన్ను మరల
గొనివచ్చి। యింపు నిలిపె ॥ననుగూ॥

—♦ అర్జునుడు కందం ♦—

ఆచెలి చెలువం బెన్నగ । నీచెలులకు నా నగల దె యింపొదవ గదా ।
దాచగ మరువారవ । నారాచం బని పలుక । దగును రమణి నులూచిక.

—♦ అర్జున కందం. ♦—

నారీమణిమై సౌరా । సౌరాంగనలందు బల్కు జాల నయారే । యా
రెంత చక్కనౌరా । నౌరా చెక్కులఘనందు నహిపప్రీతి ధరలోన్.

—♦ అర్జున కందం. ♦—

కురులా తేటలు కదళీ । తరులా । నిగ్గయిన తొడలు తరళనయనకున్ ।
గిరులా చన్గవముత్యపు । సరులా దంతములు చెలికి సరిగన మెచటన్.

—♦ అర్జునపాట ఆది. ♦—

ఆచెలి చెలువమూ । వచియింపజాల । నాచెలి । ఖేచరులా ।
భూచరులా । జూచితినె । దాచక । మూచక యోచనజేసెద ॥ఆచెలి॥

వన్నెలునూ । చిన్నెలును । గన్నను । నా । పన్నగ । కన్నియ
మిన్నగు । నన్నిట ॥ఆచెలి॥

నెన్నదుమూ । మిన్నగును । అన్నగవూ । పున్నమ । వెన్నెల ।
కన్నను । నందముగ ॥ఆచెలి॥

మాటికినీ । బోటికిని సాటెవరూ । మాటలతేటల నీటుగలది ।
భళీ ॥ఆచెలి॥

కులుకులును । బెళుకులును । పలుకగనూ । యిలను । నహో
బిల । నిలయున । కలవిదె ॥ఆచెలి॥

—♦ అర్జున సీసపద్యం. ♦—

వెలలేనిగందు చీమలబారు, నూగారు ఘనమైన యమ్మధుకరులు
కురులు। కోమలైన నపలితలి । కుచములు కుచములు । పరిపక్వతేనియ
భావిమోవి। నన్యులనల్లోక నదములు । పదములు । కమనీయ్య శంఖ
మంగళము గళము , వరుభూలికిసలయాకరములు కరములు । అరటి
వృక్షంబుల కడలుతొడలు । మెలమి నర్ధాబ్జమై రిని నెదరునుదురు ।,

అరయ గంధీరవము సరియానుగాను । కామినీమణిసాటి శృంగార
వతులు । గలరె యోచించిచూడ నీ జగత్రియమునా.

—♦ అర్జున కందం ♦—

లలన కొడంబడకయె । తెలిపెక । దద్వేణియూరు తెరువ ।
లెవరు నెచ్చెలి ముఖము కెదుట నిలువంగలరె । శశినిలుచు నేమో
కాని తలంపక॥

—♦ సంధివచనం ♦—

అను పలుకులు విని విశారదుండు యిట్లనియె.

—♦ విశారద ద్విపద ♦—

కురువీర యానాగకులజాతయైన । గరితెనొక్కతెను బల్కంగ
నేమిటికి । నీరూపురేఖయు । నీసుకుమార । మారూఢి । గనుగొన్న
నరకాంతలయిన । వ్యామోహమొందరె వసుధాధినాధా॥

—♦ అర్జున సీసపద్యం ♦—

అంత విశారదుడాదిగా తమవారి నందరిగూహుక యర్జునుండు
గంగకు మ్రొక్కి । అక్కడనుండి లేచి హిమాచలసేతుపర్యంత । నదులు
నిధులు దర్శింపుచూ నిలచినచోటను । ధారుణీసురులకు దానములు
ధర్మంబులు నిచ్చుచూ । ధరణిప్రదక్షిణ సల్పుచు గొన్నాళ్ళు చనిన
పిదప । పశ్చిమసముద్రతీరమై పరగుచున్న లలితగోకర్ణ । దివ్యస్థళంబు
జేరి । ద్వారకాపుర మిచటికి జేరమనుచు । జెప్పగా విని యచటికి జేర
దలచీ.

—♦ సంధివచనము ♦—

విశారదుని జూచి యర్జునుం డిట్లనియె.

—♦ అర్జున గీతపద్యం ♦—

ద్వారకాపుర మిచటికి దాపుగాన । నేను నొంటిగ యటకేగి
మేనమామ కూతురును । సుభద్రగై కొని కోరివత్తు । అంతపర్యంత
మింమండుడయ్యమీారూ॥

—♦ అర్జున॥ సంధి॥ ద్విపద ♦—

అనిపల్కి వారల నచ్చట నిలిసి । వనితను గొనిరాగ వాసవి దలచి । అతి ప్రీతితోడను యాదవులెపుడు । యతులను భక్తితో నరసిగొలిచెదరు । గావున నే ద్వారకాపురంబునకు । వేవేగమున యతి వేషంబుతోడ । పోయెదననుచు । నబ్బురముగాదలచె , నా యర్జునుండు నీ యవనిలో జనులు అంగనరోశి । సన్యాసులౌచుండ । నంగినగోరి సన్యాసంబుదాల్చె.

—♦ అర్జున గీతం ♦—

అటుల సన్యాసియై నిలచి యర్జునుండు । తనదు కార్యంబునకు బలుం డను మతింప । డయిన నేమాయె , నన్ని కార్యములు దీర్ప శౌరి గలడని తలచె యుత్సాహముననూ॥

—♦ సంధి వచనము. ♦—

ఇట్లు నరుండు తనను తలచుకొన్నయెడ కృష్ణుండు వచ్చుట॥





—♦ సీసపద్యం ♦—

శ్రీ రమారమణి మణిరమ్యాచారజ్జనూపురం బా , ద్వారకా పురంబు । అనుపమరత్నస్థితాంబరం చుదితగోపురం బా । ద్వారకా పురంబు , కామితవస్తుసంఘుప్రదంబై తగు గోపురం బా । ద్వారకా పురంబు । సర్వసర్వంసహాతిభూషణములకు దాపురం బా , ద్వారకా పురంబు । ముదముతోడుతను సకలసంపదలబొదలు మా పురంబగు శ్రీ ద్వారకాపురంబు । సర్వకాలంబు గడు సంతసమున మాకు । గాపు రంబగు శ్రీ ద్వారకాపురంబూ.

—♦ శ్రీ కృష్ణుడు॥ పాట॥ ఆది॥ రేగు ♦—

కృష్ణుడారుగూడెంచెనపుడు । అర్జునుజేరా॥ కృష్ణ॥ శ్రీకృష్ణ॥
కృష్ణుడపుడు కడు కృపతోడను దను । జిష్ణుసుతుడు దలచినమాత్రం
బున॥ కృష్ణ॥

పాణీతలమున మురళీ మెరయా । పేహారమందు । ఆణీముత్యపు
సరములొరయా । నాణెమైన విరిబోణులతుల । కల్యాణమలరగను ।
గానము సేయగ॥ శ్రీకృష్ణ॥

లలితాహోబిలమున వెలశి । శ్రీతాటిచర్ల లక్ష్మీనరసా । శర్మ
నరసి । కలుములు శుభములు గలుగజేసియును । బలుమరుకృపచే
బరిపాలించే॥ శ్రీకృష్ణ॥

—♦ సంధివచనము ♦—

ఇట్లు తనకు బ్రత్యక్షంబైన శ్రీకృష్ణమూర్తిని గాంచి కరకమ
లములు ముకుళించి॥

—♦ అర్జున॥ పాట॥ ఆది॥ గురుమహా ♦—

శరణు మురారే । శరణుమురారే । పరమపావనా॥ శరణు॥
గురుడవు సఖుడవు । కూరిమివింమువు । చరణసేవకుని పరిపాలించవె
॥శరణుమురారే॥

నామనోభీష్టము । శ్రీమతోదీర్పవె కామితఫలదా కరిపతి
వరదా॥ శరణుమురారే॥

యక్కడ బిలచిన నక్కడ నీవై । పక్కతోడుగను పలికెద వో
తండ్రి॥ శరణుమురారే॥

ధరణి నహోబిల । ధామ శ్రీవెంకట । నరిసింహార్చిత నారా
యణ హారీ॥ శరణు మురారే॥

—♦ సంధి. కందము. ♦—

అని యీాగతి కొనియాడిన । మనమున సంతోషమంది । మధు
సూదను । డర్జును క్షేమమడిగి । యాలింగన మొనర్చి యతని దలపు
గని । యిట్లనియెన్.

—♦ కృష్ణు పాట. రూపకం ♦—
వలువలు గొనిపోకురా—వలె.

పోవుదమోయి ‌। రైవతకాచలమునకునూ ॥పోవు॥
నీవు వశించుటకు । మంచి తావులు గలిగున్న వచట ॥పోవు॥
వానవి వినుమూ । వేసవి చనుదాక నిలుమూ । భాసురముగ । నీకు
మేలు । జేసెద నే నటు పిమ్మట ॥పోవు॥
అక్షయ కృపనూ । లక్ష్మీనరసాఖ్యు । నిలను । వీక్షించు . నహోబిల
పతి । రక్షించును ని న్నిప్పుడు ॥పో॥

—♦ కృష్ణ వాక్యం. ♦—

రైవతగిరి యనునది । ఇక్కడికి సమీపముగాన నచటికి జేరి యీ యెండాకాలము పోవు వరకూ నక్కడ నుండుము పార్థా॥

—♦ అర్జన వాక్యం ♦—

చిత్త మాలాగే జేసెదను. మహానుభావా॥

—♦ సంధి వచనం. ♦—

ఇట్లు తెలిపి యర్జనుని తోడుకొనిపోయి యప్పర్వతంబున నిలిపి యిట్లనుచున్నాడూ॥

—♦ కృష్ణుని ద్విపద ♦—

వినుము కిరీటి నీ వీ గిరియందు । నొనరంగ నివసించి యుండుము నేను ద్వారకాపురి కేగి , తడయక నీకు । కోరికెల్లను కొనసాగునట్టిసదు పాయ మొక్కటి। నరగ మోచించి పదపడి తీర్చెదా బాగుగా నికనూ॥

—♦ అర్జన వాక్యం. ♦—

చిత్తము తమ చిత్తమునకు దోచినటుల నాచరింపుడు మహాప్రభో

—♦ సంధి వచనం ♦—

ఇట్లు నరుండు పునర్వందనంబు లాచరించిన దీవించి యతని సంకల్పంబు దీర్ప నియ్యకొని తక్షణంబున ద్వారకాపురంబు జేరె॥

వులూచి పరిణయం — సంపూర్ణము.





# శ్రీ సుభద్రాపరిణయము.

## యక్షగానం.



—♦ బలరామ కృష్ణుల కథ॥ ఉత్పలమాల ♦—

శ్రీ వెలయంగ ద్వారకకు । జేరినపిమ్మట కృష్ణమూర్తి, యా రైవతకాద్రికేగు వివరంబును యోచనజేయగోరి తా । రేవతిభర్తతో గలసి । ప్రీతిగ ముచ్చటలాడుకొంచు । సద్భావము లుల్లసిల్లగ । సభాస్థలి కేగిరి అన్నదమ్ములున్॥

—♦ పాట॥ ఆది॥ దర్బార్॥ బలరామకృష్ణ ॥♦—

కొలువుదీరినారు । బలకృష్ణులు । కొలువు। చెలువుగమణిమయ చిత్రితరోచులు । వెలయసింహాసనములపై । నిండి॥ కొలు॥

వారకామినునులు వరుసగ నాడ । సువాసినీలు హారతులను చేనందుకపాడ । భటవర్గములు బారులుదీరి సదాకొనియాడ । సేసాలు చల్లి పౌరులు గుంపులు గూడుక చూడ । మోదాముతోడా॥ కొలు॥

పురమునముత్యాపు సరములువ్రేలా । అంగుళీమూల కరమరుదుగ నుంగరములుగ్రాలా, మెరుపగుకాంతుల దిక్కులు దూల, నిత్యానందభరితులగు నీ త్రిభువనజాలా । మారాసియేల॥ కొలు॥

కంకణరవములు కణకణమ్రోవ మాభామిను లిరువంకల, వింజామరములు వీవ । శ్రీ తాటిచర్ల వెంకటనరసాభిఖ్యుని సేవా ।

జేయాగమెచ్చి । సంకోచంబులు దీరిచిబ్రోవ భక్తులగావ॥ కొలువుదీరి నారూ బల॥

—♦ బలకృష్ణుల సంధివచనము ♦—

ఇట్లు కొలువుదీరి కృష్ణుండు బలరాముని గాంచి.

—♦ కృష్ణ॥ కందార్ధము॥ ఆది ♦—

రైవతకాచలమందున శ్రీ వెలయగ నుత్సవంబు రేపొనరింపగ్ గావలెనని యత్నించితి భావంబున నటులజేయా బంపూమూ । మనవి చిత్తగింపుమూ । నామాట సమ్మతింపుమూ సొంపుగ నందరిజూడగ రమ్మని ఇంపుగ పురి సాటింపజేయగా బంపుమూ.

—♦ బలరామ కందార్ధము. ♦—

నీవు ప్రియత్నముజేసిన నే వలదని యడ్డుజేతునె మురవైరి ।
కావున మనమందరమును । దేవునికార్యమున కేగు । దెంతాము ।
యుత్సవమునూ జేయింతమూ అంతఃపురవరకాంతల దోడ్కొని
వింతమీర మనమంతయు గిరికేతెంతమూ॥

—♦ సంధి వచనము ♦—

అంత ఆనతిచ్చిన కృష్ణుండు భటులంగాంచి,

—♦ కృష్ణ కందపద్యం. ♦—

గంగకజాతర రేపే । రంగుగజేయంగవలయు రైవతకాద్రిగ్ । పొం
గుచు సర్వపదార్థములంగొని రండనుచు చారులను బిల్వడికరగ్.

—♦ కృష్ణునివాక్యము ♦—

ఆహా భటులారా! రైవతగిరియందు రేపుజాతర జేతమురమ్మని సర్వజనులకు తెలియజేసి సమస్త పదార్థములు సిద్ధముచేయించుడు పొండు.

—♦ సంధివచనం ♦—

అని పల్కి సభికులందరికి సెలవిచ్చి యేకాంతంబుగానుండి సమాచారంబు బంపిన సత్యభామ వచ్చుట.

—♦ సత్యభామ కథ తెరలో ద్విపద ♦—

సరసిజాక్షుండు సమాచారంబు బంప । సరగున నాలించి సత్య భామయును । మణిమయంబైన కమ్మలు చౌకట్లు । ఘనమైన గొలుసులు గజ్జలుంగ్రములు , రేగడి నెలవంకరత్నకేతకియు బాగుగా ధరియించి పడతులతోడ । ముచ్చటలాడుచు ముదముదీపింప । నచ్యుతు జేరంగ , నరుదెంచె నపుడు॥

—♦ సత్యభామ॥ పాట॥ రేగుప్తి ఆది. ♦—

చనుదెంచాను । సత్యభామ , మనమలరాగ , వనితాలలామా ॥చను॥
యువజనమూ లోనసీమాడ ధవునిజేరు తలపుతోడ ॥చను॥
చందామామసాటి మోమునందూ కళాలంకరింపా ॥చను॥
మేనూజిగీ మించూకన్నా నానెమనుచు నారులెన్నా ॥చను॥
ఇల నాహాబిలేశు పైన । భక్తిచే కమలానయనా ॥చను॥

—♦ సంధి వచనం ♦—

ఇట్లు వచ్చి సత్యభామ దగ్గరజేరి ఇట్లనియె.

—♦ సత్యభామ కందపద్యము ♦—

మ్రొక్కెదను నామనోహర । గ్రక్కున ననుబిలువబంపు కారణ
మేమోమకుక్కవతో సెలవిచ్చిన చక్కగ నేనాచరింతు సారసనేత్రా.

—♦ సంధి వచనం. ♦—

అనిన శ్రీకృష్ణుం డిట్లనియె॥

—♦ పాట. కృష్ణ సత్యభామల డైలాగ్ ♦—

సహోదర నాసీత యేదీరలక్ష్మణ - వలె.

కృష్ణ॥ పిలిచిన కార్యము దెలిపెద సత్యభామ । అలరై వతకాచలమం దుత్సవము నిను ॥పిల॥

సత్య॥ చెలువుడ నేనేమిసేయగవలయునో తెలియగ బలుకుము తెల్లముగాను నాతో ॥చె॥

కృష్ణ॥ అంతఃపురాంగన లందరితోడుక కాంతాదో నీవు రేపు కదలి రావలయును ॥పిల॥

సత్య॥ సంతసమున ప్రాణకాంతుడ రేపు నేను । ఇంతుల బిలచుక
నే తెంతు సెలవిమ్మ ॥చె॥
కృష్ణ॥ చెల్లెలి సుభద్రను చేర రమ్మన్నాననని । మెల్లన తోడితేవె
పల్లవపాణిరో ॥పల॥
సత్య॥ అల్ల లక్ష్మినరసార్చితు నహోబిల । వల్లభ నిన్ను గొల్వగ వచ్చెద
సెలవిమ్మ॥ ॥చె॥

—♦ సత్య. సంధి. గీతపద్యం ♦—

అంత సత్యభామ హరియాజ్ఞ చేతను । వచ్చి రాణివాస వనజ
ముఖుల । నుత్సవంబుజూడ నొనరబిలిచి సుభద్రను బిలుచుటకును
బోయె । ప్రేమమీరా॥

—♦ సుభద్ర॥ కథ॥ గీతపద్యం ♦—

రాజు నలరాజు వలరాజు రాజరాజు । తత్సుతులబోలినట్టి ।
సౌందర్యమూర్తి । నరుని తద్రూపురేఖ విన్నదిమొదలు తమకమగ్గల
మాయెనే । తరళనయనా॥

—♦ హాస్యం॥ కందపద్యం ♦—

నీ కులగోత్రము నామము । ప్రకటముగ దెలియమెపుడు ।
బరువడితోడ్క । మా కెరుగదెల్ప పిమ్మట రాకేందు । సమానవదన
రాగదవమ్మా॥

—♦ సుభద్ర॥ సీసపద్యం ♦—

ధరవసుదేవుండు తండ్రిగావలె నాకు । దేవకీదేవి మదీయ్యజనని ।
బలభద్రు డన్నగావలె వోయమ్మ । రేవతి వదినగారె శుభాంగీ ।
అనువంద రోహిణి పినతల్లిగావలె । నలకృష్ణమూర్తి మదగ్రజుండు
ద్వారకాపురము మద్వాస స్థళంబగు । అతివ నా నామధేయము
సుభద్ర । నాదు మేనత్త కొడుకైన । నరుని చక్కదనము । నెల్లను
బూసగూర్చిన విధమున సతులు తెలుపంగ వినుటచే నతనియందు ।
దగిలియున్నది నామది తరళనయనా॥

—♦ సుభద్ర పాట ఆది. తెరవెడలుట. ♦—

చిలుకాల కొలికీ యీ । వలపూ నిలుపజాలా ॥చిలు॥
చిలుకతేజీవాజీరు । డలరులములుకు లేసే ॥చిలు॥
అలతాటి డెలరేగి । నలరూచు ఝూంకృతులూ । నలుపగ నాదు మదీ
కళుకుగా దోచె నయ్యయ్యో ॥చిలు॥
కలువలా రేడూ మింట । కళల వెన్నెలగాయ । విలసితగాత్రీ మదీ
వెగటూగ దోచెనయ్యో ॥చిలు॥
కలకాలరవములు । కలకంఠములు జేయ । కలభగమన నాకు । గల
వారమయె నయ్యో ॥చిలు॥
వెలదిరో తాడిచర్ల వెంకటనరసార్చితుడా । వెలయహోబిల వాసు
చెలికాని గూడాకనే ॥చిలు॥

—♦ సుభద్ర పాట. ఆది. ♦—

అల నరునిజూడాకనే । నిలువనేర్తునె సఖి తళిరాకుబోణి మేను
పులకరించినదేమో ॥అల॥

అన్నరు రూపురేఖ విన్నదిమొదలుగ । కన్నులగట్టినట్టూన్నది
యేమి సేతూ ॥అల॥

మారుడు క్రూరుడై సారెకు పొంచి విరి । నారాచములు నెద
నాటగనేసె నయ్యో ॥అల॥

అలరుచు లక్ష్మీనరసార్చితు నహోబిలపతి చెలికానిని బిలచుక
రావే చెలీ ॥అల॥

—♦ సంధి వచనం. ♦—

ఇట్లు మోహపరవశత్వంబున వగచుచున్న సుభద్ర తావుకు
సత్యభామ చనిన గాంచి యమ్మోహంబు మరుగుపరచి వదినెగారికి
నమస్కరించిన దీవించి ఇట్లనియె.

—♦ సత్య. సుభద్ర పాట. డైలాగ్. ఆట. ♦—

సత్య॥ రై నతకాదికి రాగదవమ్మా । దేవుని పుత్సవమీవేళ నచ్చుట॥రై॥
సుభ॥ ఓ వదినెగారు పోవగవచ్చునె । వేవెగమనషూ విచ్చలవిడిగా ॥ఓ॥

సత్య॥ అందరిరమ్మని ఆనతియిచ్చెను । నందతనరాజుడు సందియ
మెందుకు ॥రైవ॥

సుభ॥ పొందుగ నచ్చట కందర మేగిన । నందున ఫలమేమో ఆనతి
య్యావమ్మ ॥ఓవదినె॥

సత్య॥ నీ మదిలోపల నేదియుగోరిన । కోమలిరో యవి, కొనసాగు
నమ్మ ॥రైవత॥

సుభ॥ భూమి నహోబిల స్వామిని దలచుచు । లేమరో ఖేదము లెమ్మిక
వేగమె ॥ఓ॥

—◆ సంధి॥ సీసపద్యం ◆—

అప్పుడు బలకృష్ణు లాప్తుల మంత్రుల బంధుల జ్ఞాతుల పరిజన
ముల । గూడి యుత్సవమును వేడుకగాజేయ దలపోసి సర్వపదార్థ
ములను, గొని తమ్మటమ్ముల కొమ్ములు పంబలు పీరణంబులు
మోాియ గదలి । రైవతకాద్రి చేరగబోవుచుండి రా వెనువెంట
కృష్ణుని యనుమతిన । సత్యభామాది రాణివాసంపు చెలులు । బయలు
దేరి సుభద్ర వెంబడిని రాగ । వుత్సవముజూడ గిరిజేరి రొప్పుగాను ।
హర్షమున నంతలోపల నర్జునుండు॥

—◆ అర్జున కథ॥ ద్విపద ◆—

శ్రీకృష్ణునాజ్ఞను శిరసావహించి । యాకొండమీాదను యతివేష
మునను । వసియించియుండిన వాసవిసుతుడు । వసుదేవ సుతుని భావం
బున దలచి । ఉదయంబునను లేచి వకనది కేగి । సదమలోదకముల స్నా
నంబుజేసి, ప్రాతరాహ్నికములు బరువడి దీర్చి, యేతెంచె తానున్న
ఇరువుకు జేరా॥

—◆ అర్జున పాట॥ ఆది॥ ◆—

శ్రీహరీ శ్రీహరీ హరే, పాహిజగత్పరిపాలన హరే॥ శ్రీ॥
సాహసవిక్రమ శత్రుభయంకర । మోహనివారణ ముచికుంద
ప్రియ ॥శ్రీహరి॥

నిత్యనిరంజన నిర్వికార ఘన । సత్యాత్మకహరి సర్వవిభో ।
ప్రత్యగభిన్న పరాత్పరరూపక । భృత్యజనావన దైత్యవిదారణ॥
శ్రీహరి॥

మందరగిరిధర నందతనూభవ । సుందరాంగ గోవిందవిభూ ।
యిందిరేశసురవందిత । సనకసనందనాదిముని బృందసనార్చిత॥ శ్రీహరి॥

పంకజమిత్ర శశాంకనేత్ర శ్రీవెంకటానరసాభిఖ్యానుత । శంకర
సన్నుత శౌరియహోబిల పంకజాక్ష గోపాలక మురహర॥ శ్రీహరి॥

—♦ అర్జున సంధి॥ వచనం ♦—

ఇట్లు వచ్చి వక్కచోట విశ్రమించి తిరునాలకు వచ్చిపోవుచుండు
జనులను చూచుచుండె. నంత దమ ఇష్టదైవంబుల కందరకు నమస్క
రింపుచుండ సుభద్రయు నర్జును భర్తగాజేయుమని గోరుచు దండ
ప్రణామంబు జేసి బోవుచున్నపుడు గాంచి సుభద్రగా నెరిగి అర్జునుండు
వర్ణింప దొడంగె.

—♦ అర్జున ఉత్పలమాల ♦—

జూచితి దేవకామినుల చూచితి యక్షసరోరుహాక్షులన్ । జూ
చితి కిన్నరాంగనల జూచితి పన్నగ సన్నుతాంగులన్ । జూచితి
మర్త్యసుందరుల జూచితి మానివినీలవేణులన్ । యీచెలి బోల
జాలరు తదేకవిశాల విలాసవైఖరిన్.

—♦ అర్జున కందపద్యం ♦—

మెదురా నెలసగ మనిరెయె । న్నదు రాజీవములు నౌకనుంగవ
బలు పల్కుదురా । కుందములని పల్కుదు రామామణికి సాటికోమలి
గలదే.

—♦ అర్జున॥ పాట॥ ఆట ♦—

వహ్వారె యీ యలనాగమేని యొయ్యార మేమందు । యొయ్యార
మేమందూ నెయ్యారె గనుగొందు ॥వహ్వారె॥

శశిబింబమునకు సమంబు దీనిముఖంబు పొంకంబు । ముఖంబు
పొంకంబూ । శంఖంబు గళంబు ॥వహ్వారె॥

మరునారిసరియగు నారు కనమరునారిసరియానారు । మరు నారి సరియానూ హంసపారిగలదేను ॥వహ్వారె॥

నాయం దహోబిలమందిరుని కృప యుంది పూర్ణముగ । కృప యుంది పూర్ణముగ దీనిపొందు చేకుఱుగ ॥వహ్వారె॥

—♦ అర్జున ద్విపద ♦—

నాతిచక్కనజూడ నాకునుగల్గె, శీత శైలారుల సేవించుఫలము । లలితాంగివళిని నే లక్షింపగానె। గలిగె గంగాతరంగముగన్న ఫలము। కనుబొమల్ పరికింపగానె లభించె । మును ధనుష్కోటిలో మునిగిన ఫలము । కటివిలాసము జూడగా గలిగె నాకు । తటుకున భూమిప్రదక్షిణ ఫలము । యిబుల దోర్దండనే యేర్పడవలదె । కుటిలకుంతలితోడ గూడియు సరస । సల్లాపములజేసి శయ్యాపై జేరి, యుల్లంబురంజిల్ల నొయ్యన రతుల । గ్రీడించుచు మరుగేరుచునుండు ।నాడుగా ఫలియించు నాతపంబెల్ల.

—♦ బలుని చంపకమాల ♦—

అనుచు సుభద్రనిట్లు కొనియాడుచు । నుండంగనంతె నుత్సవం బొనర్చి । పట్టణంబునకు పోవుచు నా బలరామమూర్తి యాతనిని నిజ మానిగానెరింగి । దగ్గర జేరి నమస్కరించి బల్వినయముతోడ । నెమ్మదిని వేడ్క లలరంగ బల్కె భక్తితోడ.

—♦ బలుని॥ కందార్థము॥ అది ♦—

చెలువుగ మా భాగ్యంబున నెలమిని మిము జూడ గలిగె, నిది సుదినంబౌ, నిలుపుడు చాతుర్మాస్యము । సలుపగ మాపురిని యుండె । చాలునూ । మా పాపములు గోలును, దయచేయుడిపుడు మేలును, తాలిమితోడుత । ద్వారకలో యీ నాలుగు నెలలున్నను । మాకంతె॥ చాలునూ॥

—♦ అర్జున॥ కందార్థము॥ అది ♦—

నీవంటి గృహస్థులు । సంభావింపకయున్న । మాకు పను లెటు దీరుఁగా । గావున మీ యనుకూలం । బేవిధమో యదియె నాకు యిష్టము ।

నివసింతు నచట । స్పష్టము మీా కిత్తు సకలాభీష్టము ।పుష్టిగ మీారలు పూజింపగ సంతుష్టినొందకను తొలగుదునే । మీాయిష్టమూ॥

—♦ సంధివచనము ♦—

ఇట్లు యతిసమ్మతిన కృష్ణుని జూచి బలరాముం డిట్లనియె.

—♦ బలుని॥ కందార్థము ♦—

. వీ రుత్తమ యతివర్యులు శౌరీ వందనముజేయు సరగున వీరిన్ । ద్వారకకును రమ్మంటిని । యూరక మన యింటిలోన , నుంతమా, నిరతము । భజియింతమా । సంతోషమూన గాంతమ. । మంతన మలరగ యిఁతి సుభద్రను యెంతో ముదమున । యతని గొలుచు టకు । నుంతమా॥

—♦ కృష్ణుని॥ కందార్థము ♦—

వీరలమర్మము దెలియదు సారెకు గన వయస్సువారు । చక్కని వారిన్ కోరి రహస్యంబుగ మన । నారీమణి సేవాకుంచా । న్యాయమూ । అన్నయ్య ఇది యాదాయమూ । పిమ్మట మనకు శ్రేయమూ । మాయామాయల మార్గము తెలియక పాయకతోచిన పగ దిగ జేయ । న్యాయమూ॥

—♦ సంధి వచనము ♦—

అనిన బలరాముం డిట్లనియె.

—♦ బలుని ద్విపద ♦—

తపసులు ఘనులు సత్యజ్ఞులు వీర । లపచారమగునట్లు లాడిన యంత । మునులకు నుపచారములు చేయువారు । ఘనముగ కన్యలు గారె పూర్వమున । మది సంశయింప కీమాడ్కి గావించు । మదనజనక యనుమాన మేమిటికి॥

—♦ సంధి వచనము. ♦—

అని యిట్లు బలరాముండు బల్కిన మంచిదని కృష్ణుండు యతని దోడ్కొని వచ్చి సుభద్ర యుద్యానవనమందు నిలపి సుభద్రతావుకు బోయి శౌరి యిట్లనుచున్నాడు.

—♦ కృష్ణమూర్తి పాట. రూపకము. ♦—

యీ యతీంద్రి సేవజేయు। మీావు సోదరి। నీయభీష్టమెల్ల దీరు। నే జపాధరి ॥యీాయ॥

కామము లడంచునట్టి। స్వాములు వీరు। రాముడాజ్ఞ యిచ్చినాడు। రమణిరో చేరు ॥యీాయ॥

కన్నెరో యహోబిలేశు। సన్నుతింపుచూ। అన్నపానాదులిచ్చి యాదరింపుచు ॥యీాయ॥

—♦ సంధి వచనం. ♦—

అని నియమించి కృష్ణుండుజన సుభద్రి యతివర్యుసేవకుపోవయత్నించి.

—♦ సుభద్రి పాట. ఏకతాళం. ♦—

ఆ యతీశు సేవజేయ పోయివత్తునూ। ఆయన యడిగినవెల్ల। నిపుడే యిత్తాను ॥ఆయ॥

కన్నెలె శిశూ్రిషజేయ। గావలెనటనూ। అన్న కృష్ణుడాన తిచ్చె నటుల జేతునూ ॥ఆయతీ॥

నలువుగ తాటిచర్ల లక్ష్మి। నరసు నేలుచూ। జెలగు నహోబిల విభుని। జేరి కొల్చుచు ॥ఆయ॥

—♦ సంధివచనం ♦—

యిట్లు సుభద్ర యతినిజేరవచ్చి కరంబులు ముకుళించి యిట్లనియె.

—♦ సుభద్రి కందం —

వందనమో యతిచంద్రిమ। వందనమో మునివరేణ్య। వందనము సుగుణచరిత। వందనమిదె। మీాదుపాద వనజంబులకున్.

—♦ సంధి వచనం. ♦—

యిట్లు మొక్కి వినయంబున నిట్లనియె.

—♦ సుభద్రి పాట. ఏకతాళం. ♦—

ఏమికావలె। మీాకేమికావలె। స్వామిదేవ పూజకిప్పు డేమికావలె। నిన్నుగొల్వనూ। మాయన్న బంపెనూ। చెన్నుగ నుపచారములూ। జేతునైకొను ॥ఏమి॥

నేర్చినేరము । లు నోర్చ్ర్వరము । అర్చనకును । పూలు పత్రు లంద యిత్తును ॥ఏమి॥

అలరు వెంకటా । నరసాఖ్యు పాలిట । వెలసిన నహోబిలేశు వినుతిజేయగా ॥ఏమి॥

—♦ అర్జు. సంధి వచనం ♦—

యీాపరికారం తాను గొని పోయిన । పదార్థములు।సమర్పించిన నందుకొని మానంబుబూని మారుపల్కక నర్జునుండు.

—♦ అర్జు॥ పాట॥ రూపకం ♦—

నారాయణ నారాయణ । నారాయణశౌరీ । హరీ ॥నారా॥

క్షీరాంబుధివరతల్పక । శూరాసురమదసంహారా ॥నారా॥

నిర్వికార నిరుపాధిక । నిర్విచారనిరంజన । నిర్వివాదనిదాధర । సర్వేశ్వర సర్వఫలద । సర్వాంతర్యామిరూప ॥నారా॥

సాక్షిరూప తాటిచర్ల । లక్ష్మీనరసాభిధాన । రక్షక శ్రీయా హోబిల । లక్ష్మీశ్వర తక్షణమున । రక్షింపుము రక్షింపుము ॥నారా॥

—♦ అర్జు॥ సంధివచనము ♦—

ఇట్లు కన్నులు మూసికొని నారాయణ నామోచ్చారణంబు జేయుచు బాహ్యంబు మరచి యర్జునుం డున్నతరి సుభద్ర తనమనంబున.

—♦ సంధి ద్విపద ♦—

నరుని చక్కదనము నారులుసెప్ప । విరివిగా మున్ను నే విని యుండితినిగద । యీరూపురేఖ । లీ యతివరునందు , నాయూహిగను । గానవచ్చె నట్లయిన । జగతి సన్యాసమసంగతంబగును। నగణితసుకుమారు డా కుమారు । నిటువంటిగాశికి నెట్లొనర్చు నకటా । తటకున నతని సుందరమునుబోలి । వీరొప్పియున్నారు వివరించిచూడ । వేరొండు గా దిది వేయేల నికను.

—♦ సంధి వచనము ♦—

అని నిశ్చయించి సంశయంబు మాని యుండె నంత కొంతతడవు వరకు మాయామౌని కన్నులు దెరచి యచ్చెలిం గాంచి యిట్లనియె.

—♦ అర్జు॥ సుభ॥ ద్వై లాగు॥ ఆట ♦—

అర్జు॥ బాలికామణి నీవు తెచ్చిన । పూలుపత్రిలు చాలునూ । ఓ లతాంగిరో లోపములు లేకుండజేయుగ బోలునూ ॥బాలి॥

సుభ॥ చాలగా యింకేమికావలె । స్వామి యాజ్ఞాపించుడూ । మేలుగానే దెచ్చియిచ్చెద మీరు నిరూపింపుడూ ॥బాలి॥

అర్జు॥ రంగుగా పరిశుద్ధమైన । గంగదేవే కామినీ పొంగుచును నభిషేకమును జేయంగవలెనే భామినీ ॥బాలి॥

సుభ॥ మంగళ ప్రదమైనయుదకము । మానివర్య దెచ్చెదా అంగుగా నభిషేకమునకు । నర్పణంబు జేసెదా ॥చాల॥

అర్జు॥ సరసరాజాన్నంబు సూపము । శాకకలమాన్నంబులు। వరుసతో నివేదనకు దే । వలయు మృదుభక్షణంబులు ॥బాలి॥

సుభ॥ ధరణిలో తాటిచర్ల । వెంకటనరసశర్మను బోప్రిచెదూ । హరికి నర్పణజేయుటకు నే నన్ని దెచ్చెద సూడుడీ ॥చాల॥

—♦ అర్జునుని సంధివచనము ♦—

అంత సుభద్ర భోజనపదార్థంబులు దెచ్చియిచ్చుటకై యింటికి పోయి మరల వచ్చునంతలో.

—♦ అర్జునుని పాట॥ ఆదితాళం ♦—

యిందున్న సుందారి యింటికి । బొమ్మాని యెందూకు బంపితినీ । అక్కటా యెందు॥

చందనగందూల సందాడిలోబాడి । మందీరమందూన మసలూచునూ । మందాగమన తా మరలీ రా దేమోను॥ యెందు॥

మందామతికి నే మందూ నహోబిలమందీరుని కృపయుందో లేదో పొందూగ చెలివోచ్చునందాక ఎట్లోర్తు॥ యెందు॥

—♦ అర్జునుని సంధి వచనము ♦—

ఇట్లు డోలాయమానమానసుండై నరుం డున్నపుడు సుభద్ర భోజనపదార్థము గొనివచ్చుచుండిన గాంచి యేమీ యెరుంగన ట్లతండు.

—♦ అర్జునుని పాట॥ ఏకతాళం ♦—

వాసుదేవ మురహరా దాసపోష ఖరహరా । శ్రీసమేత గిరిధర దేవదేవ భోగిపురా । భాసురముగ నన్ను పాలింపుము । దోషములెల్లను తొలగింపుము॥ వాసుదే॥

పురహరసంక్రందనా పూజితనందనందనా । వరద నుతసనందనా పరమభక్తచందనా । ధరలక్ష్మీనరసాభిధానస్తుతా , సురుచీ రహోబిల వరసంస్థితా॥ హరివాసుదే॥

—♦ అర్జు॥ కం॥ సంధి ♦—

నరు డిటు భగవన్నామస్మరణ । యొనర్చుచును సుదతి రాజాన్న ములుఁ । బిరబిరదేగ నివేదనపరితోషముతోడ జేసె భగవంతునకుఁ.

—♦ సంధి వచనము ♦—

దేవతానివేదన జేసిన పిమ్మట సుభద్ర యారగింపుకు బిలచి యొడ్డింపుచుండ సమస్తపదార్థములు కడుపునిండా భుజియించి యొక్క శశికాంతపు టరంగుమీద విశ్రమించి తన కంటికెదుట పగడపు కంబంబుచాటున నిలుచుండి యోరగంట చూచుచుండిన సుభద్రతో నా కపట యతి యిట్లనియె.

—♦ అర్జునుని ద్విపద ♦—

చెలియ నీఁ రాజిల్క చెట్టబట్టినది । కలికి నీఁ రాయంచ కాలుతొక్కినది । జలజాక్షీ విను మంచి శకునంబు లివియు । వెలది యీలోపల పెండ్లియా నీకు । నామాట నీవు మానసమున నమ్ము । యేమాత్రమును సంశయింపకు చానా॥

—♦ సంధి వచనము ♦—

అప్పుడు సుభద్ర తన మనంబున.

—♦ సుభద్ర॥ ద్విపద॥ ♦—

ఔరా వీరనగ మహాత్ములు ఘనులు । నేరుపుతోడుత నే జేసి నట్టి । సేవకు మెచ్చి వచియించి రీలీల । గావున వీరి చెంగట జేరి

మొ్రిక్కి। కొన్ని వార్తలు దెలుసుకోవలె ననుచు। గన్నియ యా తని గడ కేగి పలికె.

—♦ సుభద్ర॥ అర్జు॥ జెలాగు॥ ఆది. ♦—

సుభ॥ మానివర్యా మీతో కొన్ని। మాటలాడా గోరితి। నేను
సేవా జేయుదానా, గానా మిము జేరితీ॥ మానివర్యా॥
అర్జు॥ మానినీ నీ మనసులోని। మాటా లేమో యడుగావె। పూని
యన్ని దెలిపెదాను। పొలతీనాతో నుడువావె ॥మానినీ॥
సుభ॥ చొచ్చి మీరు। చూడానట్టి। చోటులెందూ లేవుగా। ముచ్చ
టాగా। యింద్రప్రస్థపురము కెన్నడు బోరుగా ॥మాని॥
అర్జు॥ యిచ్చలు మే మాపురమున కేగుచుంటె వారమూ। అచ్చాటా
చాలాకాలము, అతివ యుండినారము ॥మానినీ॥
సుభ॥ పాండవు లేవురు గూడి। బాగూగా యున్నారుగా। దండిగాను
అర్జునుని, తామూ గాంచినారుగా ॥మాని॥
అర్జు॥ అండజాక్షిశ్రీ యా। హోబిలా ధీశుని కరుణానూ। పాండు
సుతులు క్షేమమేను, పార్థుజాడా గానాను ॥మానినీ॥

—♦ సుభ॥ కందార్థం. ఆది. ♦—

కరుణ కర మునిశేఖర। నరు డింద్రప్రస్త పురమునను లేకు న్నన్। బరువడి యేపని కొరకును। విరివిగ జనినారో, మీరూ। విం టిరా। యచ్చాటనైన। గంటిరా, ఆయనతో గలశి। యుంటిరా। వంటిగ మీరలు యుర్విని దిరుగగ। నంటిన ముదమున। నాతనిజాడా వింటిరా। యెచ్చటనైనా ॥గంటిరా॥

—♦ అర్జు. కందార్థం. ఆది. ♦—

తరుణీ తీర్థములాడగ, నరుడెంచెను నర్జునుండు నపుడప్పుడు మే మిరుపురము కొన్నిచోట్లను, జరియింతుము కలశిమెలశి। చాన రో। మరాళా। సమా। యానరో। వినగదె లతా। కూనరో। మానుగ వారికి మాకును। భేదము। మానినిరో। యేమాత్రము లేదు చానరో ॥వినగదె॥

—♦ సుభ. అర్జు. పాట. డైలాగ్. ♦—

సుభ॥ సాగిలి మ్రొక్కెదను । సామి । సాగిలి । దేవ । సాగిలి । జాగు సేయనేలా విజయా జాడాదెల్పు పాదములకు ॥సాగి॥

అర్జు॥ వేగమె తెలిపెదనూ । చెలి వేగ । శ్రీ గోకర్న స్థలమునందు । బాగుగ మేముంటిమబల ॥వేగమె॥

సు॥ పొంకాముగా నచ్చుటా । సామి పొంకా। యింకేమి సేయుచు నుంటి । రెరుగబల్కు మానితిల్క ॥సాగిలి॥

అ॥ వెంకటా నరసార్చితు । డగు ॥వేంకట॥ శంకారు నహోబిలేశు సఖుని గొల్చుచుంటి మబల ॥వేగమె॥

—♦ సుభద్ర కందార్థం ఆది. ♦—

గోకర్న క్షేత్రం బన । నీకడ కది యెంతదూర , మే తట్టుండున్ ప్రాకటముగ నా సరసుడు । ప్రకరముగ నింతావరకూ । జేరునా ఆవలా బోవా గోరునా । చూడగా , సమా । కూరునా సారెకునా మనసార వేడెదను । ధీరవరోత్తమ । దెలుపుము మాఫురి । జేరునా॥

—♦ అర్జు. కందార్థం. ♦—

లలనామణి నీ మదిలో । నలరుచు మరి గుచ్చిగుచ్చి యడిగెద వేమో । తెలియగ బలుకుము విజయుని తలుపున । మోహించియున్నా దానవా ,యీావర కతని । గానావా । చెప్పినదాకా । మానవా । మానసమున ననుమానములేకను । మానక నడిగెవు । వాని వరించిన దానవా । యీావార కతనీ॥

—♦ సంధి వచనం. ♦—

అనిన సుభద్ర యిట్లనియె.

—♦ సుభద్ర॥ పాట॥ ఆట ♦—

చిత్తగింపుము యతివర్యా । క్రొత్తాదాననూ గానూ । కోపించకయ్యా ॥చిత్త॥

చిత్తాజకారుడు క్షితిపాలవరుడు మేనత్తాకొడుకుగానా నడిగెద నయ్యా ॥చిత్త॥

ఎగు భుజములుగలవాడు । జిగిమొగమున । జీరు । నగవుగల వాడు ॥చిత్త॥

మృగరాజుబోలిన మేటినడుమూవాడు । సొగసూగ చల్లని। చూపూగలవాడు ॥చిత్త॥

చులుకానాగాజూడకండి। యల నరునిజూడాగా నా। కాశాగల దండి। లలితా తాటిచర్ల । లక్ష్మీనరసాఖ్యుని । వెలయూహోబిల। హరి పతి। పాదమాన ॥చిత్త॥

—♦ సంధివచనం ♦—

అని వేడిన పార్థుండు.

—♦ అర్జనుని పాట ఆది ♦—

వినంగదే చెలియా । దెలిపెద వినంగ మనంబునను ననుమాన మింకేటికి ॥వినం॥

నోచెలి యున్నది । యున్నటులన్న । లేచిపోదువని తోచుటచే దాచితి ఇకను యథార్థము దెలిపెద ॥విను॥

నేనార్జునుడను నీకోసరమై । చానరో యతివేషమువేసి । నే నరుదెంచితి । నీ విటు ఎరుగవు ॥వినం॥

తటుతరగాత్రిరో । తాటిచర్లనవెంకటరసాఖ్యుని । కరుణించూచటు లాహోబిల స్వామికి సఖుడను ॥విను॥

—♦ సంధివచనము ♦—

అని యథార్థము పలికిన సిగ్గుపడి సుభద్ర తనమనంబున నిట్లని యాలోచించుచున్నది.

—♦ సుభద్ర కందపద్యము ♦—

యితడర్జునుడే మోాయని । యతులితముగ మున్ను మదినియను కోనియు నా నే యతివేషము గని నమ్మక। సతతము నుపచారములను సలుపుచునుంటిన్.

—♦ సంధివచనము ♦—

కాన నింక నిక్కడ నుండదగదని పోవ యత్నింపుచున్న సుభద్రతో నరుం డిట్లనియె.

—♦ అర్జున॥ పాట॥ రూపకం ♦—

నన్ను బాసీ । బోవదగునె । నళినలోచనీ । నిన్ను గోరివచ్చినాడ। నెన్నాళ్ళాయె న్నాతిరో । యున్నాడను మన్నింపుము ॥నన్ను॥

కొత్తవాడను గాను నీ, మేనత్తకొడుకునే । బిత్తరి సిగ్గేల నింక చిత్తంబున తత్తరపడ । కిత్తరి నను గుర్తింపుము ॥నన్ను॥

మోడిసేయానేల బాల । నేడు సుదినమూ । చూడ దహాోబిలేశ సుతుని క్రీడలలో చేడెరో నేఁ వేడుకగా గూడగదె ॥నన్ను॥

—♦ సంధి వచనము. ♦—

అని సవ్యసాచి తన మనోభావంబు తెలిపిన విని యుత్తరము చెప్పక తల వంచుకొని యూరకుండిన సుభద్ర ముంజేతిపై నున్న పెంపుడు చిలుకను గాంచి యిట్లనియె॥

—♦ అర్జు॥ పాట॥ ఆట. ♦—

ఇది యేమీ అన్యాయము - వలె.

చిలుకా వినదాయె । యీ వొయ్యారి । పలుకే ప్రియమాయె చెలియ నాతో బలుగుటకు దా । సిగ్గుపడినను । నీకునైన పలుకగా రాదటవె దీని । పలుకు బంగారమా కాని ॥చి॥

అతివ్వాయు ననుగూడిన । చక్కెరబెట్టి । అతివేడ్క నిను జూడనా । చతురులై మీవారు । మును సతిపతుల గూర్చుచునుందు రిపు డా గతిని దీనిని నాకు గూర్పుము । క్షితి నహోబిల । పతిని గొల్చుచు ॥చిలు॥

—♦ సంధి వచనము. ♦—

అని పలికిన సుభద్ర చిలుకతో నిట్లనియె.

—♦ సుభద్ర కందపద్యము. ♦—

మీయంత వారలటు లన । న్యాయంబె పెద్ద లెరిగినం గళ్యాణం బీయెడ జేతురు । తొందరచేయగ నేటికని మనవిజేయవే చిలుకా॥

—♦ సంధి వచనము. ♦—

ఇట్లు సుభద చిలుక ముఖంబుగా పలికిన పలుకులు విని యర్జునుం డిట్లనియె.

—♦ అర్జున పాట. ఆది. ♦—

ఎన్నడూ దెలిసేదారక్కటా , కన్యరో మీవారలికను ॥ఎ॥
మనకూనూ వివాహ మెప్డుడో । వనిటరో గావింతూరోను ॥ఎ॥
అంతకూ సైరించ గలమే । కాంతరో మారాడనేల ॥ఎ॥
ధారుణీ నాహోబిలేశు । డారయూ నన్నిందు జేర్చెనూ ॥ఎ॥

—♦ సంధి వచనము. ♦—

అనిపలికి పట్టరాని తమకంబున నట్టె చని దేవకీపట్టి చెయ్యి పట్టుకొని తా నున్న యరుగుపైకి దిగచిన నా సుభద్రి యిట్లనియె.

—♦ సుభద్రార్జునుల ద్విలాగు ♦—

సుభ॥ దేవేంద్రినందాన । దీనర్థిచందాన । తీవార పడనేలనూ । తెలి యుమూ । భావాము లోపలనూ ॥దేవేం॥
అర్జు॥ దేవకికుమారి । రావె సుకుమారి । భావజు కేళీలోన నిన్ను నే॥ వేవేగ దేలించెదా ॥దేవకి॥
సుభ॥ మాయన్నలున్నారు । మహానిత్యమూర్తులు । మనలాను కోపిం తురూ । చూచితే మర్యాదగా నుంచరూ ॥దేవేం॥
అర్జు॥ న్యాయముగ లక్ష్మీనరసాఖ్య నేలేదు శ్రీ అహోబిలేశుడె నన్నిందు జేర్చెను భయమేలనూ॥ దేవకి॥

—♦ సుభద్రార్జునుల సంవాదం॥ సీసమాలిక॥ ♦—

సుభద్రి॥ భూపాల యతి వని । బుద్ధిలో నూహించి
శ్రీకృష్ణు డిచ్చుట జేర్చె నిన్ను
అర్జు॥ యతివేషమున నీవు । నతివేగ రమ్మనీ
యతివ బోధించిన దతడుగాదె
సుభ॥ నీ వర్జునుడ వని నిజముగా దెలసినా
నన్ను సేవకు బంపునా తలంప

అర్జు॥ నినుగోరి యతినైనై నే నిందు వచ్చుట
యెరుగును గాన ని న్నుందుబంపె
సుభ॥ అయిన నేమాయె । మావారల యనుమతమున
నన్ను పెండ్లాడి గొంపొమ్మ న్యాయముగను
అర్జు॥ పెద్ద లెరుగుట యెప్పుడు । పెండ్లి జేయు టెప్పు
డుందాక నిలువ నెవరితరము॥

—♦ సంధి వచనము ♦—

అప్పు డచ్చెలి యిట్లనియె.

—♦ సుభద్రా॥ అర్జు. డైలాగ్ ♦—

సు॥ విడువిడుమూ వాసవీ । వడిగా నే బోవలె నాచై॥ విడు॥
అ॥ భయ పడకె సుందరీ । పడతులైన నిక్కడ లేరిక॥ భయ॥
సు॥ త్వరపడగా నేటికి । పెదదారుల బోవడము తగదు॥ విడు॥
అ॥ నను విడచీ పోవగా । కడువడితో నీకాహ్లాదునె॥ భయ॥
సు॥ పదుగురిలో నిందెలా । గురిదప్పిన పని సరిగా దిక॥ విడు॥
అ॥ సరిసరిగా బల్కకె । ధరణి నహోబిల హరిగలడిక॥ భయ॥

—♦ సుభద్రా కందార్థం —

మావారల యనుమతిచే, నీవిచ్చుట జేరుటెల్ల నిజమైయున్నన్ భావింప దొంగపనులను । గావింపగ నేలా బూర్వా । కర్మామా । యీ పనికింతా । మార్మమా । రాజుల కిది ధర్మమా । ప్రేమతోడ నను పెండ్లిజేయరె । కూర్మితోడ నీవు గోరకయుండుట॥ ధర్మమా॥

—♦ అర్జు. కందార్థం. ♦—

తన శిష్యుండని దుర్యోధనునకు । నిన్నివ్వ బలుడు దలచె నటంచుణ । వినియుంటిని గాన నతిప్రీతిని । నా కిమ్మన్న సమ్మతించూనా, వివాహమును గావించునా । నన్నింక గారావించునా । అంచయాన యది అవశ్యకమని । యెంచనతడు । నాకివ్వగ సమ్మతించునా॥

—♦ సుభ॥ అర్జు॥ డైలాగ్॥ ఆది ♦—

సు॥ బలరాముడు గీముడు వినకున్నా । లోప । మేమిక చాలును కృష్ణుడున్న ॥బల॥

అ॥ గజగామినిభామిని ప్రేమతోడ । కృష్ణసామియె ననుదెచ్చి నిల్పెనీడ ॥గజ॥

సు॥ అటులైనను చిన్నన్న సమ్మతంబు । గాని । యైనను బెండ్లాడి తీసుకపోమ్మా ॥బల॥

అ॥ అలివేణిరో కల్యాణమైనదాక । నిల్వ । లేనుగదె మించె మరుని ధాకా ॥గజ॥

సు॥ యింతమరులు నీకెంతటిలోన మీారె । యెన్నిమార్లు చెప్పినాను మంచివారె ॥బల॥

అ॥ తాటిచర్ల శ్రీ వెంకటనరుసునేలు । శౌరి చెల్లెలని కౌగిలిమ్మాచాలు ॥గజగామి॥

—♦ అర్జు॥ సుభ॥ సంవాదము॥ సీసపద్యం ♦—

సుభ॥ అన్నలు తల్లిదండ్రులున్నారు వారలు
సమ్మతించినదాక సైచియుండూ

అర్జు॥ ఎప్పటి వేడుక లప్పుడేకానిమ్మా
తర్వాత మాట్లాడుదాముచెలియా

సు॥ మనము స్వతంత్రముగను పనిజేసిన
పిమ్మట వారు కోపించుకోరె

అ॥ ఏకాంతసమయ మిం దెవ్వారలునులేరు
వారి కెల్లరుకొను వారిజాక్షి

సు॥ ఎవ్వరున్నను లేకున్న నేమి ధర్మ
మందు నుండంగవలదె మీాయంతవారు

అ॥ వెలది నే ధర్మహానిగావించినాన
నిన్నుగూడంగ గోరితీ నీరజాక్షి.

—♦ సుభద్రి అర్జు. డైలాగ్॥ ఆది ♦—

కలికి కవాటబంధనచేసిన- వలె.

సు॥ వాసవినందాన । యీషణముల మది । రోసినవారె యుందూ ।
సన్యాసము దాల్తురె ముందూ ॥వాసవి॥

అ॥ ఓసుదతీమణి । భాసురముగ నీ । కోసరముగ నోభామా సన్యా
సము దాల్చితి లేమా ॥ఓసుద॥

సు॥ కొంచెపుభోగము । కోరి యింతటిపని । మంచిగ జేసితిరేమీ
యిది వంచనగాదె సామి ॥వాసవి॥

అ॥ వంచనజేయగ । వలెనా నినుగూడ మించి స్వతంత్రుడనుగానా
వరియించియు గొనిపోవలెనా ॥ఓసుదతీ॥

సు॥ అంతి స్వతంత్రుడ । వైన కార్యమగు నంతకు నిలువగలేవా ।
మీయంతవారి కిదీ త్రోవా ॥వాసవి॥

అ॥ కాంత యహోబిల । కాంతుడూ నాసఖు డింతకు పరవా ।
యేమీ । నీ । కేటికి మీ పోరేమీ ॥ఓసుదతీ॥

—♦ సుభ. కందం. ♦—

నిరతం బీ వేళకు నే । నరుదెంచుచునుందు, నింటికటువలెనేడుౕ
సరగున జనకుండిన । నా తరుణుల కనుమానమగును త్వరగా జనెదౕ

—♦ అర్జు. కందం. ♦—

రావే కోకిలవాణీ।యీవే నీబిగివికౌగిలింతే చాలుౕ । ఆవెనుకను
నీయింటికి । పోవె యిది మంచిమాట, పూర్ణేందుముఖీ.

—♦ సుభ. అర్జు. డైలాగ్. ఆట. ♦—

వాకిటా నిలాచిన ధీరు డెవడే—వలె

సుభ॥ ఇంటికి । పోయెదసామి । యింతట శెలవివ్వవేమీ, వెంటనే
పెండ్లికి । ప్రయత్నము । వేగమె చేయండి నే నిక ॥యింటి॥

అర్జు॥ వంటిగా । నన్నిందూ బాలా । యుంచియు, నీ వేగుట మేలా
తుంటవిల్తుడు, కంటగించిన । కంట కూరుకు వచ్చునటవె
॥యింటి

సుభ॥ మగువాలు । వచ్చేటి వేళ । మసలగతగదు బాలా । అగడు
జెందగ । నేలను మీా, యంతవారికి జెప్పగ నా ॥ఇంటి॥
అర్జు॥ జగతిని యహోబిల । వాసుడగుచూను శ్రీ లక్ష్మీనరసు । అగణి
తంబుగ సిరులొసంగెడు । హరిసహోదరి తాళజాలా ॥నొంటి॥

—♦ సంధి ద్విపద. ♦—

అని వాదులాడుచున్నంత లోపలను । ఘనముగ గీర పికంబు లేతేర, చప్పుడువిని తన చానలువచ్చి । రిప్పుడటంచును నెలమి తో చెయ్యి, పట్టు తప్పించుక పారిపోజూడ । నట్టి నిరాశుడై యత డిట్టులనియె.

—♦ అర్జు. పాట. ఆది. ♦—

ఏమన గలనె । యిది ఘనమగునె । కామిని నీమది, కరుగదా యెనె ॥ఏమన॥

చిలుకలు కేకలు, పిలపిల రాగను । చెలులను నెపమున । తొలగి పోజూచితి ॥ఏమన॥

నీవు పెంచినావని । నెలతారో జూడకె కావిలి బెట్టనె । కాముడు నీపై నా ॥ఏమన॥

ధరణి నహోబిల ధవుడే వేంకట । నరసవరుని బోిచె । హరి చెలియ నిన్నే ॥ఏమనగల॥

—♦ అర్జు. సంధి. వచనం. ♦—

అని యిట్లతండు వెనువెంటబడి వేడుచున్నను విడక నాంతి లోదరి చిత్తంబున తత్తర పడుచు తిరిగి తిరిగి చూచుచు చప్పుడైన నెవ్వరు పొత్తురో యను శంకచే జంకుపడుచు తిన్నగా దన కేళికా గృహంబు జేరి విరిశయ్యపై పరుండె నంత నిక్కడ కాంతనుబాసి నరుండు కటకటపడుచు దనమనంబున నిట్లని వగచుచుండె.

— అర్జు॥ పాట॥ అట. ♦—

కటకటా యేమందునూ । కలికి నెన్నడు గందునూ । యెటుల నోర్చి యుందునూ । యెన్నటికి నను బొందునూ॥ కటకటా॥

చంచలాక్షి వచ్చికా చనియె నింటికి చెప్పకా । పొంచిశరములు గుప్పక ప్రాణ మరుడు తప్పక॥ కటకటా॥

భూమిలో నహోబిలా । స్వామిక్రుపచే కన్నులా । భామినీమణి గాంచెదు । భాగ్యమెన్నడు గల్గెదూ॥ కటకటా॥

—♦ అర్జు॥ తెవారము ♦—

నేను నిక్కంబు బలుకా । నెలత తా నిందు నిలకా కానరాకుండ బోయె కౌగిటను జేర్పదాయె । చాన యిక యీడ నీవ నలుపరాదేది త్రోవ । మానినికి నెనరు లేదు మరచితె మరుపురాదు॥

—♦ అర్జు॥ పాట॥ ఆది ♦—

ముందుగసుందరిని । యెందుకువలచితి । తొందారపడిదానితో నేల బలికితి । అందపొందరా । నట్టి పలుకులని యిందూవదాన తా నింటికి బోయె॥ ముందు॥

పేరు వివరించి యేల । బేలనై తినయో । కోరికదెల్పి యెంతో గోలానై తినయో । నారీమణి యిక । నాకం కెదుటికి । జేరవచ్చి నను సేవింపదు ముందు॥ ముందుగ॥

ఈ క్షితి శ్రీ యహోబిలేశుడై కూర్మిని లక్ష్మీనరసావర్య । రక్షించుదేవుని । అక్షయకరుణా వీక్షణ గలిగిన । తక్షణమున సుందరి నొనగూర్చును॥ ముందుగ॥

—♦ అర్జు. ఉత్పలమాల —

కాంతకు నాపయిన్ । వలపుగలిగియు నే మునుముందు బిల్చుటన్ యంతయు సిగ్గుతో నవలనేగెను గాని గృహంబుజేరునా । యంతట యింతటన్ వనమునందె వశించియు నుండ వచ్చునే । స్వాంతము రంజిలన్ వెదకి జూడ యెరింగెద దాని జూచెదన్.

—♦ అర్జు॥ తోహర ♦—

అని నిశ్చయపడి యర్జునుడపుడా। వనమధ్యంబున కరిగి యను పుగ । తరువిహా । గాదులనెల్లను వెతకుచు నచ్చటజేరి॥

—♦ అర్జు॥ పాట॥ ఆట॥ ♦—

సతినీ గనలేదా, ఓతరులారా। సతి॥ సతినీ గనలేదా వో।
లతికలార వృక్షతతులార యతులితాకృతిచేత రం॥ల్లు॥ సతి॥

భృంగాములారా రంగై నాసారంగాములారా, లుంగా యా
లకీ మాతులుంగా లవంగా। పతంగ శృంగార మాతంగ ఛాయ
ములారా॥ సతి॥

కీరాములారా, గోరవంకా। మాయూరములార, కోకిలా
మీరా శృంగార ముట్టిపడ సౌరాయాంహోబిలా। శౌరీచెల్లలై న॥ సతి॥

—♦ అర్జునుని సీసపద్యం ♦—

సంపెంగ గానవే। సంపెంగవాసను। లికుచంబకానవె, లికు
చకుచను। హరివర్యకానవె। హరివర్యమధ్యను। మధుపంబకానవె
మధుపవేణి బల్లవకానవె। బల్లవసమపాణి। నుత్పలకానవె నుత్ప
లాక్షి, వరహంసకానవె। వరహంసయానను। గమలంబకానవె।
కమలముఖిని। పికసమూహముకానవె। పికసువాణి। కుందకుట్మల
కానవే। కుందరదన। యించుభోణిని గానరే। యిందు మీర।
లనుచు సుభద్రవెదకె నయ్యర్జునుండు.

—♦ అ॥ తోహరా ♦—

అర్జను డిచ్చట అతివెను వెతకుచు, అనురాగముతోనుండా।
అర్జునసఖుడగు। హరి సత్యాంగన। కనిమె నామె వినుచుండా॥

—♦ కృష్ణ॥ కందార్థము॥ ఆది ♦—

విను సత్యభామ యతిరై। వనమునసివసించియున్న। వా డర్జ
నుడో। వోసర నుభద్రను గొనిపోవను నిచటికి। వొచ్చియున్నా।
వాడూగా, సమయూముగనుచున్నాడుగా, గొనిపోకా మురలీ
పోడుంగా। యీడుజోడుగలదీ। మనుమని నే। జూడగ నాతడు,
సుందరి చేరినవాడుగా॥

—♦ సత్య. కందార్థము ♦—

మును రైవతకాచలమున । గనియుంటిని అతని నిపుడు, గన లేదుసుమీ । వనితామణికోర కం దున్నను । ఫలమేమియో నింకా సందానందానా । తెలుపుమూ । భక్తచందానా । వినుతాముని । సంక్రిందనా, పొందుగవేళకు భోజనమొసగె । టందుకు నెవ్వారచ్చట నందానందానా॥

—♦ కృష్ణ॥ సత్య॥ ద్విలాగుపాట॥ ఆదితాళం ♦—

కృష్ణ॥ వనితారో బలరాము డనుమాతి నంపా । చనెను సూభద్రి యాతనిసేవింపా ॥వని॥

సత్య॥ వనజాక్షసేవాకు వొచ్చునాకాంత । గోనిపోకా యూరకుండునే నరుడంతా ॥వని॥

కృష్ణ॥ కోరికాడెలిపీనా కోమాలివానీ, చేరాక నిలచేను సిగ్గూపై కోని ॥వని॥

సత్య॥ నారీ మానుకున్న । నరునీ కీవేళా । యేరీతి జరిగేను యెరిగింపు చాలా ॥వని॥

కృష్ణ॥ సత్యాభామానీవు । చను డెంచి కనుమీ। అత్యంతప్రేమాతో అదారించూమీ ॥వని॥

సత్య॥ చిత్తాము మీఆజ్ఞచే నేను గాంచి వత్తూ నహోబీలా, వాసా యే తెంచీ ॥వని॥

—♦ సంధివచనం ♦—

అని శ్రీకృష్ణుండు చెప్పిన వల్లె యని । సత్యభామ సరసపదార్థ సంపన్నంబైన యన్నంబునూ । శాకసూపాపూపాయుతంబుగాగొని చని ఖిన్నుండై యున్న యర్జునుజేర నరిగి.

—♦ సత్యభామ॥ పాట॥ ఆటతాళం ♦—

అన్నా కిరీటి నే నన్నము దెచ్చితి ।యూరాగింతువు లెమ్మికా । క్రిన్నానభోంచేయుకాలాముమీరెను । యెన్న డింత తడ వున్నావా డవుగావూ ॥అన్నా॥

నీతేట మొగ మేము నేడూ వెలవెలబారే హేతూవ దెలి యాదుగా ॥అన్నా॥

శ్రీ తాడిచర్ల లక్ష్మీనరసార్చితు, యీతారి శెలవివ్వ, యే తెంచితిని చూడూ ॥అన్నా॥

—♦ సంధి వచనం. ♦—

ఈరీతి బిలచిన కిరీటి తన మనోభావంబును బయలు పడనీక నొకపాటిగా భుజించి యందున్న నతనితో సత్యభామ యిట్లనియె.

—♦ అర్జున సత్యభామల సంవాదం తోహర. ♦—

స॥ ఇచ్చట శేవకు వొచ్చు సుభద్రియు నెచ్చటికేగెను నేడూ।ఇచ్చట యూపెను యేమేమంటివి । యెరిగింపుము నాతోనూ॥

అ॥ చెచ్చెర నీతో చెప్పకనుందునె । చెల్లెల వినగదవమ్మ, మచ్చి కతో నే మాట్లాడుటచే మరలిరాను యాకొమ్మా॥

స॥ దిటవుగ నరుడని దెలిశి శిగ్గుపడి । కుటిలాలక తాబోయె । యిటు వలె వొంటిగ యెన్నాళ్లుందువు యింతి తిరిగిరాదాయె॥

అ॥ తటుకున ధరలో తాటిచర్ల వేంకటనరసాఖ్యుని నేలూ। చెటు లాహోబిలస్వామి కరుణచే । సమకూరును కార్యాలూ॥

—♦ సంధి వచనము. ♦—

ఇట్లు సత్యభామ యర్జునున కన్నంబొసంగి యతని మనోమలికితంబు దెలిసి తక్షణంబున సుభద్రిమేడకు జనునెడ నామెయు వాసవి వియోగసంజనిత విరహోద్రేకంబున చెలికత్తియతో నిట్లనుచున్నది.

—♦ సుభ. పాట. ఆది. ♦—

మోసాపోతీ । నే సుదతి । యేసంగతి నెరుగానైతి । వాసవి నునుగోరి । వనమున, నాశతోడ జేరి । నను, డాసి రతులగూ । డగ వేడిన నే, తోశివేశి యెడ । బాసి వొచ్చితి ॥మోసా॥

నేనూ గోరినట్టివాడు, తానే నన్నూ వలచీ నేడు । మానుగ చనుదెంచి । కోరిక, మానక వివరించి । యడిగిన। వాని మాటలకు

వలదని వచ్చితి। కాని కౌగిటను। గమ్ముమగ నైతినేమో। విరహా మెంతో, మీరిపోయె। మరుడూ దాడిమానాడాయె ॥మో హా॥

ధరను తాటిచర్ల। వెంకట। నరసాఖ్యునివల్లా। పూజలు। గురుతరముగ గై। కొనెడు నహోబిల। హరి యేమనునో। యని భయపడితీ ॥మోసా॥

—♦ సుభద్రి కందార్థం. ♦—

నిరతము యతివర్యుండని। పరిచర్య యొనర్చుచుంటి భామా మణి నే। నరుడని యెరిగినమీాదట, కరమరదుగ నెంతసిగ్గు। గప్పెనె। అత డెంతో। నాకూ। జెప్పెనె విననైతి। వల్లదప్పెనె। యిప్పుడు బోయిన। యేమని యనునో। తప్పెనుకార్యము। తరుణిరో సిగ్గు గప్పెనూ॥

—♦ సుభ. పాట. త్రిపుట. ♦—

నరునిబాసి యెట్టులా సైతునె। వోభామా యేమె, విరహ భార। మెందుదాతునె। సరసూ మాటను। సమ్మతింపక। పరుగు బారితి। పనికిమాలితి ॥నరుని॥

మలయమారుతము వీచెనే। చంద్రుడుగాయు కళల వెన్నెల కాక తోచెనే। చిలుకలను। కోకిలలు కలకిల। పలుకజొచ్చెను। నిలువనేరను ॥నరుని॥

మరుడూ మొగలికటారి। నూరెనె, ఝూంకారములతో మధు పచయములు। బారుదీరెనె। తరుణీరో నే తాళజాలనూ। ధర నహోబిల హరిసఖుండగు ॥నరునీ॥

—♦ సుభద్రి॥ సీసపద్యం ♦—

నే నర్జును డని నిజముబల్కినవేళ, నిలచి మాట్లాడగనేరనైతి। నిన్నుగై కొనిపోవ। నేవచ్చితటన్న ॥ మంచిదంచును సమ్మతించనైతి। కోరిక యెరిగించి కూడుదామన్నను। కూరిమితోడ జై కొనగనైతి। పోనద్దువద్దని। బోధజేసినవేళ తొలగక నేనందు నిలువనైతి। అన్నపా నాదులిచ్చియు నాదరించు। వారు యెవ్వరు లేక నాపనమునందు। యంత

శ్రీమపడుచున్నాడో । యింద్రిసుతుడు, యేమిసేయుదు యిట్లవృట యెరుగనైతి॥

—♦ సంధి॥ వచనం ♦—

యిట్లు సుభద్రి విరహంబుచే పరితపించుచున్న సమయంబున సత్యభామ యిట్లనియె.

—♦ సత్యభామ॥ కందార్థం॥ ఆది ♦—

సతతము యతిసేవకు । నీ వతులితముగ బోవుచుండు। వతివేగ మె నే । డత డేమి తప్పుజేసెను । అతివా తొంగ్గైనా చూడవైతివి । పాపమనకాపోతివీ । దాక్షిణ్యముంచా వైతివి । నాతిరో నిన్నెనమ్మిక యుండిన, యాతనికార్యము । లన్నియు । దీర్చవైతివీ॥

—♦ సుభద్రి కందార్థము ♦—

పిల్లికి జెల్లాటంబా । పల్లవకర యెలుకకేమో, ప్రాణాంతమ గునె । అల్లది నిజమాయెను ।, సరి । సల్లలితంబుగ జెప్ప । జాలనూ యేమీ యెరుగానీ । బాలనూ । వేళాకోళాము । లేలనూ, యీ లాగున మది కేది, దోచ దిటు । యేలాగగ్గైనో । యెరిగిచెప్పగా ॥జాలనూ॥

—♦ సుభ॥ సత్య॥ డైలాగ్॥ పాట॥ ఆది ♦—

సత్య॥ ఎంతలో హెచ్చె నేనీ । కింత యీవిరహాము । యింతకు వొచ్చు నని । యెరుగగజాలమూ । కాంతరో యిది యేకాంతసమయ ముగు, వింతగజరిగిన, దంతయు దెల్పుము॥

సుభ॥ కంతునీ బారి కిక । ఘడియైన తాళను యెంతమాత్రిము సైచి। యేనుండజాలనూ, అంతరంగామునూ । సతివడి దెల్పితి యిం తిరో కార్యము । లెల్లను దీర్చుము ॥కంతు॥

సత్య॥ నిన్న నేడెవ్వని । గన్నావో భామినీ । పన్నూగదాచకనూ, పలు కుమూ కామిని । చన్నుగ నీమది । స్నిగ్ధేటికి నీ కా । యున్నది యు న్నటు । లువిదరో దెల్పుమూ ॥యెంతలో॥

సుభ॥ కృష్ణ డార్జునుడు నా యుద్యానవనమున । నన్ను పెండ్లాడ
వొచ్చినాడు కపటమున । కన్నుల నాతని । గంటి నహోబిల ।
నన్ని లయునిసతి । స్వ పజాలా నికా ॥కంతుని॥

—♦ సత్యా॥ కందం ♦—

శ్రీకృష్ణున కెరిగించియు। నీకార్యము నే నొనర్తు । నేడో రేపో ।
యేకాంతమందు జెలిపెద । ప్రకటముగ యర్జునుండు భర్తగు నీకున్.

—♦ సుభ॥ సత్యా॥ పాట॥ డైలాగ్ ॥ జుల్వ ♦—

సుభ॥ పెద్దల కెరిగింపకమ్మా । ముద్దులగుమ్మ । అద్దిరా నాసిగ్గుదీయు।
కమ్మా । నీపుణ్యమయ్యానిగా నింక ॥పె॥

సత్యా॥ పెద్దలు వినకున్న నీకు పెండ్లియెట్లాను । ముద్దియ నీమదిని
భయము । వొద్దూ । పనులెల్ల దిద్దుదు నే మన ॥పె॥

సుభ॥ అన్నలు వినిరేని నన్ను ఆదరించేరా । నన్నుతాంగి కన్నతల్లి
విన్ననూ । కోపించు న న్నెంతో దూరునో ॥పె॥

సత్యా॥ అన్నువ శ్రీ లక్ష్మీ నరసాఖ్యుని నేలూ।చున్న శ్రీ యహో
బిలేశు । డున్నాడె వా రేమి । యన్న విన్ననేమి ॥పె॥

—♦ సుభద్ర॥ కందం ♦—

మోహము మిక్కుటమాయెను । దేహము పరవశమునొందె ।
నిలువల్లె జెడన్ । శ్రీహరి యనుమతిచే వై । వాహికమగునట్లుచేయు
వొదినరో నాకున్.

—♦ సంధివచనం ♦—

అని యిట్లు వేడుకున్న మంచిదని చెప్పి సత్యభామ కృష్ణమూర్తి
సన్నిధికి జేరి యిట్లనుచున్నది.

—♦ సత్యా॥ సీసార్ధం ♦—

ప్రాణేశ మీయాజ్ఞచే సన్యమును నేను । వాసవికిని బెట్టి వచ్చి
నాను । అతడు సుభద్ర రానందుకు మదిలోన । నురుమోహవశుడు
నై యున్నవాడు । మన సుభద్రస్థితి యనుకొన బనిలేదు । వాసవిపై
మిక్కిలి వలపుహెచ్చి । యన్నోదకంబులు నారగించుటమాని । యేమి

తోచకయున్నది । యీ విజయుని గ్రామించి మారూలుకొన్నదీ । ప్రేమతో వారాలకు। పెండ్లిజేయక మీాకు । స్వామీా యూరకుండుట । సరిగాదు సుదతిమది । కేమిదోచదూ॥

—♦ కృష్ణుని కందార్థము ♦—

భామరో నీ వన్నపగిది జేయగ । నిందుకొప్పదు బలభద్రు డొక్కరుండు । గాన నాతని నొకకార్యంబు నెపమున । దొలగించి యతనికి దెలియకుండ।నెనిమిదవనాటికి నే తెంతు నావేళ । మంచిలగ్నము గాన । మంజువాణి । నీవు నీసనతులు దేవకియునుగూడి । పెండ్లియత్న ముజేయుడీ । చేరవలసినవాండ్లను బిలువనంపుడు యిండ్లు వాకిండ్లను బూ।యించి యామిద । నాలా । గండ్లను దోడితెచ్చి । గై సేయిం చుడువేగ , పెండ్లియత్నము ॥సేయుడూ॥

—♦ సంధి॥ తోహర॥ ఆది ♦—

అని యిటు సత్యకు । నాజ్ఞాపించియు । హరి బలరామునితోను। వనుదము శంభో।త్సవమున కనగా । సమ్మతించి సరియనెను । యాదవు లందరు మోదముతోడా । హరుని మందిరముజేరి । సాదరమున నటు సంస్తుతిజేయుచు సల్పి రుత్సవము కోరి॥

ఇక్కడ సత్యయు । రుక్మిణి మొదలగు , నింతులు ముదమున హెచ్చి। చక్కగ జని నరుసఖని సుభద్రను , మక్కువతో తోడి తెచ్చి। పెండ్లియింటికిని ప్రియమున జేరిచి , పెండ్లిజేయ బూనగనూ । దండిగ రేవతి । ధవునకు జెప్పక , తరలివచ్చె హరి దయనూ॥

—♦ సుభ. అర్జు. పెండ్లిపాట ఆది. ♦—

శోభానమనరె । సుభద్రనరులాకు , శోభా॥ వోభామీానులార వై భోగముగ । శుభ ॥శోభన॥

చంపాకా గంధులారా । సంపెంగ నూనెతో , సొంపూగ తల లంటి । యింపుగ నలుగులిడుచు ॥శోభన॥

జలకములార్చి మంచి జిలుగు వలువ లిచ్చి తులలేనిసొమ్ములు। తొడిగి యలంకరించి ॥శోభన॥

భాసుర పీఠముల । నాసీనులానుఁ జేసి । భూసూరవరులాను । వాసిగ బిలిపించి ॥శోభన॥

మంగళావాద్యములు రంగుగ మ్రోయగ । మాంగల్యధారాణి మగువాకు జేయించి ॥శోభన॥

పిమ్మట తలంబ్రాలు ప్రియమూన బోయించి । నెమ్మాదితో తాంబూల । మ్మా లందరి కిచ్చి ॥శోభన॥

పొందుగ నందరు బువ్వము బంతికి । విందారగించియు । వేడూకతో శుభ ॥శోభన॥

లలిత శ్రీ తాటిచర్ల । లక్ష్మీనరసాఖ్యుని । చెలగి రక్షించు నహోబిల । హరి కరుణాతో ॥శోభన॥

—♦ సంధి. తోహ. ఆది. ♦—

యీరీతిగ పెండిలి । వేగజేసి వారి । నింద్రప్రస్థ పురమునకును సాగనంపి తక్షణమె శౌరియును , నేగె బలునిచెంతకును । తేరెక్కించుక । తెరవను దోడ్కొని । దారిబట్టి పోవగనూ । వారల గని కా । వలివారలు । పోవలదని పలుకుచు దగనూ॥

—♦ పృధుశ్రవసుని వేషం- యుద్ధం ♦—

—♦ పృథు. పాట. ఆది. ♦—

పృథుశ్రవసు డపు , డధోక్షజుని సేన । కధీశుడై వెడలెగా । సరాసరి యధీశుడై వెడలెగా

యుధిష్ఠ రాజును వధింతు నే నని । వృథా గర్వమున । నతార్భి జూపుచు ॥పృధు॥

హుటాహుటిని । చిగురుటాకుబోణిని । తటాన గొని నడుమా సరాసరి , తటాన । గొని

భటాగ్రణిని నను । తుటాయించిన , నెటోర్తు నని యూ , ర్భటించుకొనుచును ॥పృధు॥

శరంబులను । శర । శరాసనంబులు । ధరించి బిరబిరనూ ।
సరాసరి । ధరించి బిరబిరనూ । పురారికై నను దురంబులో నను, ధరించ
శక్యమె । ధరిత్రి ననుచును ॥పృథు॥

అహోబిలస్థల । విహారుడగు శ్రీ । విహంగ వాహనునీ , సరా
సరి । విహంగవాహనునీ । సహోదరిని గాని । యుహాపోయెడిని ।
వహ్వారె పోనగ నిత్తునె ॥పృథు॥శ్రీ॥

—♦ సంధి వచనము. ♦—

ఇట్లంభోధరిగంభీరవిజృంభితసంభాషణంబుల సంరంభించు సైని
కులడంబంబులు విని సుభద్ర యర్జునుని కిట్లనియె.

—♦ సుభద్ర॥ అర్జు॥ సంవాదము॥ త్రోహార॥ ఆది ♦—

సుభ॥ వచ్చెను సేనలు । వడిగను మన్పై । మచ్చరంబుమీరగనూ ।
యిచ్చట కలహము హెచ్చునేమొ । మన మెటువలె బోదగు
నికనూ॥ వచ్చె॥

అర్జు॥ వచ్చిన భయపడ। వలసిన దే మిక। జెచ్చెర నే బోరిగొందూ ।
చిచ్చుమీదికని। వచ్చుమిడుత లని । మత్సకంటి కను మిందూ॥

సుభ॥ తేరు నడుపగనూ । బోరుసేయగను , నేరిపె శ్రీకృష్ణుండు ।
శూరులనెల్లను సుక్రీడిగించెద , సొంపుపెంపు గనుగొండు॥

అర్జు॥ నారీమణి యాడువారికి। యుద్ధము న్యాయముగాదు వచింతు।
తేరునడుపు మంతె చాలును । నరవీరుల నే మడియింతూ॥నారీ॥

సుభ॥ అన్న మున్ను నరకాసురు బోరిగొన।నరగసత్యభామయునూ।
చెన్నుగ యుద్ధము చేయలేదె నా । చేతగాద వేడదనూ॥

అర్జు॥ కన్నెరో శ్రీ వెంకటనరసాఖ్యుని । గాచు నహోబిల విభుడూ
న న్నేమనునో నామాటలు విని । నాతిరో యూరక చూడు॥వ॥

—♦ సంధి త్రోహార॥ ఆది ♦—

ఇటుల సుభద్రిక । నెలమిదెల్పినం । తను పృథుశ్రీవసుందూ
భటులగూడుకొని । పార్థుని నాగియు । పలికె నపుడు ధీరుండూ.

—♦ పృథు॥ కందార్థం॥ అది ♦—

ఏరా రాజకుమారక । శూరుడవై శౌరిని నవ జూడక యిపుడు చోరత్వమున సుభద్రను । వారక గొనిపోవుచున్న వాడావు । నీవెంత ప్రజ్ఞావాడవు । పమ్ముల జూచి యోడావు । కూడనిపనియనుకోక జేసితివి । నేడు నిన్ను మన్నింతునె యెంత ॥ వాడవు॥

—♦ అర్జు॥ కందార్థం అది. ♦—

చోరుడనో శూరుడనో । ధీరుడవై యెదుట నిలచి తెలియుమ దురహంకారముతో । నా కడ్డము దూరియు పలికెదవు , నేనూ దొంగానా నీపాటి నీతి యెరుంగనా । బంధువులెల్లను బాగుగ గనుగొన అంగనగొని నే నరుగుచునుండగ । నింగిత మెరుగక నిట్లాడెదవు॥దొంగ

—♦ పృథు॥ అర్జు॥ డైలాగ్॥ అది. ♦—

పృథు॥ మేలుమేలాయె లెమ్మిక । బలె మేలు । మంచిమేలు । నీ చేలుడు విన్న నేల మన్నించు నిన్ను॥ మేలుమేలా

అర్జు॥ చాలుచాలూను నిల్వరా । చాల్ చాలు , ఇంక చాలు కాలుపోరిలూకు ని న్నీవేళా బంపూదు॥ చాల్।

పృథు॥ ముద్దుగుమ్మాను గొనిపో । వద్దు చెప్పిన వినక । పద్దులాడిన నిన్ను గుద్దూదు వీపుబగుల ॥మేలు

అర్జు॥ నీవు న న్నాగవచ్చి । నావు నాబలము । తెలియ లేవు మంచిది నీకు చావుమూడెను ॥చాలు।

పృథు॥ గుట్టుతోడను హరితో । బుట్టును మరలవిడచి । పెట్టు లేకన్న నిన్ను మట్టూబెట్టెద ॥మేలు।

అర్జు॥ పిడుగుజోలి నా బాణా । లడుగు దప్పక విడువ । నడుగ చంకలు వదలు , నుడుగు ప్రగల్భము। ॥చాలు॥

పృథు॥ మూడులోకములందు । మూడు నాకన్న । మనగాడు । లే డిక విను గోడు గుడిపింతు నిన్ను ॥మేలు॥

అర్జు॥ పోరి నీతోడ నేను । పోరి । వెంకటానరసా । దాదియగ నహోబిల । శౌరి మెచ్చాగ దుర్రింతూ ॥చాలు

—♦ పృధు. పంచచామరం ♦—

చిటచ్చిటాచ్చిటార్భటిల్ । విశేషవిస్ఫులింగముల్ । తటాన మిన్ను ముట్టగాను। దగ్ధతీవ్రబాణముల్ । పెటాపెటాన దాక బిట్టు వైతు నొక్కటన్। పటుప్రతాప ముప్ప నెందు బారి కెందు నిల్వరా.

—♦ అర్జు. పంచచామరం ♦—

సరాసరిన్ పరాకుతోడ। చాలుబంటుపందెముల్ । నరాధమా భిరాన నీవనంగ నేమికారణం । బురా సురాసురాదులైన। బూని యుద్ధపడ్డ నిన్నె నా శరంబుచే ధరిత్రియందు మ్రిందజేసెదన్.

—♦ పృధు. అర్జు. సంవా. తోహార. ఆది ♦—

పృధు॥ అదుగో ఆగ్నేయాస్త్రము వచ్చెను। వదలక నిను దును మాడు। యిది తప్పించుక నేగిన శూరుడ। వింతె చాలును చూడు ॥ఆగ్నే॥

అర్జు॥ వదురపోతువలె। వాగకు నాదగు । వారణాస్త్రమును వేసి। వదలక ఘడియలో। వహ్నిబాణమును। వధియించెద నటు డాసి ॥వదు॥

పృధు॥ శూలమువైచెద । శూరుడవైతే సోలకసొక్కక నిలుపుమా। తాలిమిలేకను । తలదునుమాడును। తప్పదు సత్యము వినుమా ॥శూల॥

అర్జు॥ బాళిమీర నే। పాశుపతాస్త్రము। బరువడిని ప్రయోగింతూ। శూలముగీలము। సుక్కక నిలుచును। చూడుము పట్టి వధింతూ

పృధు॥ వురగాస్త్రంబును। నురువడివైచితి। నుగ్రంబున। పైకొనుమా। త్వరగా దీనిని। తప్పించుక నీ। తరముగాదు। కనుగొనుమా ॥వుర॥

అర్జు॥ వరదు డహోబిల। గరుడవాహనుడు। ధర నాసచివుడుగాడా। గరుడాస్త్రంబున నురగబాణమును। నురుముసేతు గనరాదా ॥వరదు॥

—♦ సంధివచనము ♦—

ఇటుల ప్రగల్భంబులాడుచూ పై కొనిన పృథుశ్రవసుడు లోనగు భటవర్గంబులపై దుర్గమంబగు మార్గణంబులు ప్రయోగించి తన విలు విద్యాసామర్థ్యంబు గనుపించిన కంపంబు నొంది యందరు జిల్లాకు చెదురుగా పారిపోయి రంత.

—♦ గొబ్బిపాటలు ఆది ♦—

గొ॥ పార్థుడు సుభద్ర నిందప్రస్థపురికి జేర్చెనో ॥గొబ్బి॥
గొ॥ ధర్మజునకు । దంపాతులు । వందములు బెట్టిరి ॥గొబ్బి॥
గొ॥ కుంతి మహాదేవి కపుడు । కూర్మిగోడా మ్రొక్కిరి ॥గొబ్బి॥
గొ॥ వారలా దీవనలంది । వైభవముగనుండిరి ॥గొబ్బి॥
గొ॥ బలకృష్ణులు పురికి జేర , భటులు మొరపెట్టిరి ॥గొబ్బి॥
గొ॥ యుద్ధమునకు సన్నద్ధుడై । యుండె బలభద్రుడూ ॥గొబ్బి॥
గొ॥ వద్దానుచు నాయత్నము । వాసుదేవు డంపెనూ ॥గొబ్బి॥
గొ॥ ఆనధువరులాను జూడ । యాదవ్రాలు గదలిరి ॥గొబ్బి॥
గొ॥ బల కేశవ్రులరాక విని । పౌరులు ముదమందిరి ॥గొబ్బి॥
గొ॥ ఎదురూగాను । యుధిష్ఠరు । డేగి తోడితెచ్చెనూ ॥గొబ్బి॥
గొ॥ దంపాతూలు బలకృష్ణుల । కింపుతోడ నెరగిరి ॥గొబ్బి॥
గొ॥ అందరికె ధర్మరాజు । విందులూజే యించెను ॥గొబ్బి॥
గొ॥ ముత్తైదువా । లాద్దంపతుల । ముదమున గై చేసిరి ॥గొబ్బి।
గొ॥ శ్రీయూహూబి । లేశుపేరా । చేరిహారతు లెత్తిరి। ॥గొబ్బి॥

మంగళహారతి.

శ్రీశమంగళం,చిత్ప్రకాశమంగళం కోశవిలక్షణ యహోబిలేశ మంగళం। స్వామి మంగళం । గరుడగామి మంగళం । నామరూపరహిత పరం
ధామ మంగళం।
ధీరమంగళం । శుభాకారామంగళం । నారదాది మానిహృద్విహా
మంగళం।

## తాటిచర్ల విజయవిలాస నాటకము.

శౌరిమంగళం । వినుతసూరిమంగళం । శ్రీ లక్ష్మీనరసశర్మ ధీర మంగళం.

—♦ మంగళహారతి. ♦—

నరహరికీ । మంగళం । ధరణి నహోబిల । ధాముడైన ॥నర॥
కనకకశ్యపునిదునిమిన బాలుడా, ఘన ప్రహలాదుని గాచిన శ్రీ ॥నర॥

మానిత సత్యజ్ఞానానంద । నూనాఖండిత । నుండగు శ్రీ ॥నర॥
నిరతము వేంకట నరసశర్మ, హృత్సరసీరుహాసంభరుడగు శ్రీ ॥నర॥

—♦ ఆశ్వాసాంతము ద్విపద. ♦—

అని యిట్లు సకల లోకాధీశుపేర। వనజాతసన్నిభ వదనునిపేర। కరివరదుని పేర కళ్యాణుపేర, సరసిజాసనముని సన్నుతుపేర । శ్రీ యహోబిల నరసింహునిపేర । శ్రీ యుతంబుగ తాడిచర్ల శ్రీ లక్ష్మీ। నరస శ్రీ వేంకట నరసాభిధాను, లరసి ప్రేరేపింప నతిమోదమునను। సుజను లామోదింప సుందరఫణితి, విజయవిలాసంబు వెలయ తాళ్లూరి। నారాయణాఖ్యుండు నాటకంబుగను। తా రచియించి యుద్ధతి బ్రచురించె నీ చరిత్రంబు మహీస్థలియందు, నాచంద్ర తారార్కమయి యొప్పుగాత.

శ్రీ మదహోబిల లక్ష్మీనరసింహార్పణమస్తు.

సంపూర్ణం.

---